

# మాతృభాష మహాత్ముడి బాట

డా॥ జి.వి. పూర్ణచందు

మాతృభాషను కాపాడుకుందాం!

స్వాభిమానం చాటుకుందాం!!

# మాతృభాష మహాత్ముడి బాట

డా॥ జి. వి. పూర్ణచందు

బి.ఎ.యంయస్



ప్రపంచ తెలుగు రచయితల సంఘం(రి)

ప్రచురణ

**మాతృభాష-మహాత్ముడిబాట**
**Maatrubhaasha-Mahaatmudi baata**
**Dr. G V Purnachand, B.A.M.S.**

మొదటి ముద్రణ:
**2020 జనవరి 30**

వెల :
**50-00**

ముఖచిత్రం:
**రాము అలహరి**

డిజైన్:
**మధులత గ్రాఫిక్స్,**
**అరండల్ పేట, విజయవాడ-2**

ప్రచురణ:
**ప్రపంచ తెలుగు రచయితల సంఘం**
**ప్రచురణ సంఖ్య-3**

ముద్రణ :
చైతన్య ఆఫ్‌సెట్ ప్రింటర్స్
విజయవాడ-2.

ప్రతులకు:
**ప్రపంచతెలుగు రచయితల సంఘం**
సత్నాం టవర్స్, 1వ అంతస్తు, రాజగోపాలాచారి వీధి
గవర్నర్ పేట, **విజయవాడ-520 002**
ఫోన్స్: 9440172642, 9440167697

## 'ప్రపంచతెలుగు' కోసం....

ప్రపంచ తెలుగు రచయితల సంఘం పుట్టగానే నూరు రేకులుగా విచ్చుకుని పరిమళించింది.

2019 జనవరి 10న ఆవిర్భావం మొదలు అవిరళంగా శ్రమించి, ప్రజల గుండె తలుపులు తడుతూ, 2019 డిసెంబరు 27, 28, 29 తేదీలలో 4వ ప్రపంచ తెలుగు రచయితల మహాసభలను విజయవంతంగా నిర్వహించింది.

దేశ విదేశాలనుండి సభ్యుల చేరికతో పరిపుష్టమయ్యింది.

తెలుగు భాష పరిరక్షణ, అభివృద్ధి, ఆధునీకరణల లక్ష్యాలతో, తెలుగును 'ప్రపంచతెలుగు' గా తీర్చిదిద్దేందుకు కంకణధారి అయ్యింది.

తెలుగువాడిగా పుట్టినందుకు ప్రతీ ఒక్కడూ గర్వించేలా ప్రజలలో భాషాభిమానాన్ని ప్రోది చేయగలిగితేనే మాతృభాషకు మనుగడ... అనే నమ్మికతో కార్యాచరణను రూపొందించుకుంటోంది.

"మాతృభాషను కాపాడుకుందాం! స్వాభిమానం చాటుకుందాం!!" నినాదంతో ముందుకు సాగుతోంది

4వ ప్రపంచ తెలుగు రచయితల మహాసభల సందర్భంగా 'ప్రపంచతెలుగు', 'తెలుగు ప్రపంచం' బృహద్గ్రంథాలను ప్రచురించాము. మహాత్మాగాంధీ 150 జయంత్యుత్సవాల సందర్భంగా ఈ "మాతృభాష-మహాత్ముడిబాట" లఘుగ్రంథాన్ని 3వ ప్రచురణగా వెలువరిస్తున్నాం.

ఈ గ్రంథ రూపకర్త డా. జి.వి. పూర్ణచందు తెలుగు భాషోద్యమ ప్రముఖుడు. వైద్యరచయితగా, సాహితీవేత్తగా, పరిశోధకుడిగా ప్రసిద్ధుడు. శతాధిక గ్రంథకర్త. మాతృభాషలో ప్రాథమిక విద్య విషయంలో వివిధ సందర్భాలలో గాంధీజీ వెలిబుచ్చిన అభిప్రాయాలను భాషోద్యమంలో తన అనుభవాలు, పరిశీలనలతో మేళవిస్తూ ఈ గ్రంథ రచన చేశాడు.

మహాత్ముడి బాటలో నడవటానికి తెలుగు భాషోద్యమ కార్యకర్తలకు ఈ పుస్తకం ఒక కరదీపిక కాగలదని నమ్ముతున్నాం.

*గుత్తికొండసుబ్బారావు*
అధ్యక్షుడు

# మహాత్ముడిబాటలో

# భాషోద్యమానికి కరదీపిక

**- డా. మండలి బుద్ధప్రసాద్**

*"ఆంధ్రున కాంధ్రదేశమున నాంధ్రవధూమణియందు పుట్టి తా*
*నాంధ్రుల సొమ్మునం బెరిగి యాంధ్రవధూటిని పెండ్లియై సదా*
*యాంధ్రమె వాడుచున్ దుదకు నాంగ్లము నాంధ్రులవద్ద నేర్చి య*
*య్యాంధ్రుల జూచి యేహ్యపడు నాంధ్రు డొకానొకడేమి నైజమో"*

తెలుగు తండ్రికి, తెలుగు తల్లికి పుట్టి, తెలుగు సొమ్ము తిని పెరిగి, తెలుగమ్మాయిని పెళ్లి చేసుకుని, తెలుగునే వాడుతూ, చివరికి ఆ తెలుగు వారివద్దే ఇంగ్లీషు నేర్చుకుని, ఆ తెలుగును చూసి ఈసడించే తెలుగువాడు ఒకడు... అతనికిదేమి నైజమో...!? అని ఆశ్చర్యాన్ని ప్రకటిస్తున్నాడు నిరుద్ధభారత కర్త శ్రీ మంగిపూడి వెంకట శర్మ.

షుమారు 105 యేళ్ల క్రితం నాటి పద్యం ఇది. సరిగ్గా నేటి కాలానికి అక్షరం అక్షరం వర్తిస్తోంది.

"స్వస్థాన వేషభాషాఽభిమతాస్సంతో రసప్రలుబ్ధధియః

లోకే బహుమన్యంతే వైకృత కావ్యాని చాన్య దపహాయ" (నన్నయ భట్టారకుడు ఆంధ్రశబ్ద చింతామణి) స్వస్థానం, స్వవేషం, స్వభాష వీటిపైన అభిమానం ఉన్న రసలుబ్ధబుద్ధులైన సత్పురుషులు ఇతర మార్గాలను విడిచి, వైకృత కావ్యాలు అంటే సంస్కృతేతర మాతృభాషలలో రచనలు చేస్తారని నన్నయ ఒక నిర్ధారణ చేశాడు. అచ్చతెలుగులో రచనలు చేసిన మహాకవు లందరికీ నన్నయగారి ఈ ఆశీస్సులు అందుతాయి. భాషాజాతిగా తెలుగు వారంతా తమ జాతీయతను నిలబెట్టుకో గలగాలి. స్వభాషాభిమానం, స్వజాతీయాభిమానం, స్వాభిమానానం వీటిని వదిలేసినందు వలన భాషా సంస్కృతులు దెబ్బతింటాయి. మానవ సంబంధాలు, కుటుంబ సంబంధాలు కూడా బలహీనపడతాయి. ఇది జాతి మనుగడకు చేటు.

"తెనుగుబాస వినిర్మింప దివురుటరయ భవ్య పురుషార్థ తరు పక్వ ఫలము కాదే" అని మాతృభాషాభిమానాన్ని పురుషార్థంగా తిక్కనగారు చెప్పుకున్నాడు. సంస్కృతం చదువుకున్నప్పటికీ, ఆంధ్రోజ్జీవనార్థం అంటే తెలుగుభాషను ఉజ్జీవింప చేయటం కోసమే ఆంధ్రమహాబారత రచన కుపక్రమించినట్లు చెప్పుకున్నాడు తిక్కన.

ప్రజలలో భాషాచైతన్యం సమకూరితేనే రాజకీయ పరమైన సానుకూలత (పొలిటికల్ విల్) సాధ్యం అవుతుంది. ప్రజలు చాలా విషయాల గురించి మాట్లాడ్డం లేదు. భాష గురించి అస్సలు మాట్లాడ్డం లేదు. అలాగని, ప్రజలకు తెలుగంటే అభిమానం లేదనటం పొరబాటు. 60-70 తెలుగు చానళ్లు, కొన్ని వందల తెలుగు పత్రికలు, ఇంకా అనేక వందల కోట్ల పెట్టుబడులతో తీస్తున్న తెలుగు సినిమాలు ఇవన్నీ తెలుగులోనే నడుస్తున్నాయి. తెలుగు అక్షరం ముక్క రాకుండా నేటి తరాన్ని పెంచితే భవిష్యత్తులో ఇవన్నీ మూతపడతాయి. తెలుగు చదివేవాడు, వినేవాడు, చూసేవాడు లేకుండా పోవటం ప్రసార, ప్రచార మాధ్యమాలకు లాభదాయకమా అనే సంగతి ఆ యా రంగాల వారు ఆలోచించి, సరైన రీతిలో ప్రభుత్వానికి మార్గదర్శనం చేయాలి. కూర్చున్న కొమ్మని నరికేస్తుంటే చూస్తూ మౌనం వహించి, సాధించేదేమీ ఉండదు.

భాషోద్యమకారులు తమ పిల్లల్ని ఇంగ్లీషు మాధ్యమంలో చదివిస్తూ తెలుగు మాధ్యమం ఉంచాలని కోరుతున్నారని ఆరోపిస్తోన్నారు. ఇన్నాళ్ళూ తెలుగును ఒక పాఠ్యాంశంగా కూడా తీసేసి, విద్యావ్యాపారులు యథేచ్ఛగా వ్యవహరించారు. మార్కులు రావాలంటే తెలుగుకు బదులు, సంస్కృతం, ఫ్రెంచి వగైరా భాషలు నేర్చుకోవాలని తల్లిదండ్రుల మీద, విద్యార్థుల మీద వత్తిడి తెచ్చి మార్కుల తాపత్రయాన్ని రెచ్చగొట్టారు. అయినా, చూస్తూ ఉపేక్షించిన ప్రభుత్వాలదే ఈ నేరం. అంతేగానీ, తెలుగు తల్లిదండ్రులు ఎవరూ తమ పిల్లలకు తెలుగు నేర్పవద్దని కోరరు. కోరలేదు కూడా!

తెలుగు నేలపైన అన్ని కులాలవారికీ, మతాలవారికీ మాతృభాష ఒకటుంటుంది. వీరిలో ఎవరికీ ఇంగ్లీషు మాతృభాష కాదు. మాతృభాషలోనే బిడ్డ పుట్టి పెరుగుతాడని, చదువులన్నింటినీ మాతృభాషలోనే ఆకళింపు చేసుకుని, జ్ఞానసముపార్జన

చేసుకుంటాడని, ప్రాధమిక విద్యలో మాతృభాష తగినంత నేర్పితే, పై తరగతుల్లో ఇంగ్లీషు బాగా నేర్చుకోవటానికి కావల్సిన సానుకూలత విద్యార్థికి కలుగుతుందని యునెస్కో కూడా ప్రకటించింది. ఈ విధానాలన్నీ ఉబుసుపోని అంశాలుగా ప్రభుత్వమే చిత్రించటం విడ్డూరం. ప్రాధమిక విద్యలో ఇంగ్లీషు కూడా నేర్పండి. ఇంగ్లీషు మాత్రమే నేర్పుతామనటం అన్యాయం.

ఇన్నాళ్లూ భాషోద్యమం ప్రభుత్వాలకు విజ్ఞాపనలు చేస్తూ వచ్చింది. దాని వలన ప్రయోజనం లేదని తేటతెల్లమైంది. గతంలో మాధ్యమిక విద్యలో తెలుగు పాఠ్యాంశం కోసం పోరాటాలు చేసి సాధించుకున్న జీవోలు ఒక్కటీ అమలు కాలేదు. ఆ జీవోలిచ్చిన ప్రభుత్వాలకే వాటి అమలుపై శ్రద్ధలేదు

ఒకసారి దక్షిణ కొరియా వెళ్లినప్పుడు అక్కడ 'సేమా ఉల్ ఇడంగ్' అంటే నవసమాజ నిర్మాణ ఉద్యమం గురించి వాళ్లు గొప్పగా చెప్పటాన్ని నేను విన్నాను. నిజానికి, కొరియన్లు సహజంగా కొంత బద్ధకస్తులు. ఆ దేశాధ్యక్షుడు నవనిర్మాణ ఉద్యమానికి శ్రీకారం చుట్టి, ప్రతి 50 కుటుంబాలను ఒక యూనిట్ గాతీసుకుని ఆ దేశపు రాజకీయ నాయకులు, మంత్రులు, కవులు, కళాకారులు, విద్యావేత్తలు వీళ్ళంతా వెళ్లి, తమ జాతి గొప్పదనాన్ని, భాష ఔన్నత్యాన్ని ప్రజలకు వివరించి చెప్తూ జనజాగృతి కలిగించారు. జాత్యాభిమానాన్ని మనం కోల్పోతే మనమీద ఇతరుల ఆధిపత్యం పెరుగుతుందనే సత్యాన్ని ప్రజలు గ్రహించ గలిగేలా చేశారు. జాతి పాడుకునే గీతంలా ప్రతీ ఒక్కరూ ఎదగాలనే పిలుపు అక్కడ గొప్ప ఫలితాన్నిచ్చింది. తక్కిన ప్రపంచంలో ఒక పనిని పూర్తి చేయటానికి అనేక నెలలు పడితే దాన్ని పదిరోజుల్లో పూర్తి చేసి చూపించటం గురించి కొరియన్ రిపబ్లిక్ ప్రజలు ఈ రోజున ఆలోచిస్తున్నారు. అదీ ఆ దేశ ప్రతిష్ఠ. భాషోద్యమం ఆశించే పరమ ప్రయోజనం ఇదే! ఇంగ్లీషు రాకుండానే ముందుపీటీన నడుస్తున్న దేశం అది!

మనం ఇంగ్లీషుని వద్దనట్లేదు. తెలుగుని ప్రభుత్వమే వద్దంటోంది. మాతృభాష లేకుండా జాతి నవనిర్మాణం సాధ్యం కాదని మహాత్ముడు స్వానుభవంతో సాధికారిగా నిరూపించి చూపించాడు. ఆయన హితవుని పెడచెవిన పెట్టి, మన పిల్లల్ని చీమలు దూరని చిట్టడివి

లాంటి ఇంగ్లీషు చదువుల్లోకి ప్రాథమిక స్థాయిలోనే నెట్టేస్తున్నాం. ప్రాథమిక విద్యని మాతృభాషలో చెబుతూ ఇంగ్లీషు కూడా అదనంగా నేర్పిస్తే ఈ ఐదేళ్ల కాలంలో తెలుగుబిడ్డ ఎక్కువ చదవగలుగుతాడనేది మహాత్ముడు ప్రాథమిక విద్య విషయంలో అనేక సంవత్సరాలు చేసిన ప్రయోగాల ద్వారా నిరూపించారు.

తమిళనాడులో తమిళ మాధ్యమంలో చదివితే 20% ప్రభుత్వ ఉద్యోగాలు, కర్ణాటక రాష్ట్రంలో 5% ఉద్యోగాలు రిజర్వేషన్ కల్పిస్తున్నారు. ఆంధ్రప్రదేశ్‌లో ఇందుకు భిన్నంగా తెలుగు మాధ్యమ పాఠశాలల్ని మూసేసి, ఆంగ్లంలో చదివితేనే ఉపాధి అవకాశాలు అని ప్రభుత్వమే ప్రకటిస్తోంది. నాలుగు అక్షరం ముక్కలు నేర్చుకుని చిన్న చిన్న ఉద్యోగాలు చేసుకునే పేదవారికి ఈ నిర్ణయం పిడుగుపాటే!

ఇతర రాష్ట్రాల్లోనూ, మారిషస్, మలేషియా మొదలైన దేశాల్లోనూ నివశించే తెలుగు ప్రజలు తమతమ ప్రభుత్వాల పైన అనేక పోరాటాలు చేసి తెలుగు మాధ్యమంలో పాఠశాలలు సాధించుకున్నారు. తమిళనాడులో న్యాయస్థానానికి వెళ్లి తెలుగులో పరిక్షలు వ్రాసేందుకు అనుకూలంగా తీర్పు తెచ్చుకున్నారు. హిందీకి బదులు రెండవ మాధ్యమంగా తెలుగును బోధనాంశంగా సాధించుకున్నారు. అమెరికాలోని తెలుగువారు 'మనబడి', 'పాఠశాల'లు నెలకొల్పి, తమ పిల్లలకు తెలుగు నేర్పిస్తూ భాషా సంస్కృతుల వ్యాప్తికి కారకులౌతున్నారు. స్వరాష్ట్రంలో తెలుగుని బలహీనపరిచే ప్రభుత్వ చర్యల వలన తాము పడిన శ్రమంతా బూడిదలో పన్నీరౌతోందని వారంతా ఆందోళన చెందుతున్నారు.

మాతృభాష అంటే, సంస్కృతి, సాంప్రదాయం. మానవతా విలువలు. మాతృభాష వీటిని మనకు అందిస్తుంది. ఇంగ్లీషు ద్వారా వీటిని మనం పొందగలమనుకోవటం భ్రమ. అవి అక్కర లేదనుకునే వారిది వ్యక్తిగత అభిప్రాయం. అధికార దర్పంతో దాన్ని తెచ్చి జాతిమీద రుద్దాలనుకోవటం అన్యాయం.

ప్రభుత్వంతో నిమిత్తం లేకుండా ప్రజలే ముందుకొచ్చి మాతృభాషని కాపాడుకునే వాతావరణాన్ని సాధించటం ఒక్కటే మనం చేయగలిగిన పని! ఊరూరా తెలుగు వేదికలు ఏర్పరచి, ఇంటిభాషగా తెలుగును వర్ధిల్ల చేయాలి. తెలుగు గురించి ప్రజల్ని ఆలోచింప చేయాలి.

బాలలలో భాషానురక్తి ప్రేరేపించాలి. బడులలో నేర్పకపోతే మన పిల్లలు బడుద్ధాయిలు కానక్కర లేదు. మనం గట్టిగా పూనుకుని పిల్లలకు తెలుగు నేర్పించుకుంటే మన పిల్లలు సృజన కలిగిన చైతన్య మూర్తులుగా, జ్ఞానవంతులుగా ఎదుగుతారు. తెలుగే రాని జాతిగా రేపటి తెలుగు పౌరులు తయారు కావటాన్ని మనం అనుమతించ కూడదు. మన సాంస్కృతిక వారసత్వాన్ని నిలిపేది నేటి బాలలే! వారిలో చైతన్యాన్ని ప్రోది చేయాల్సిన బాధ్యత మనది!

డా॥ జి.వి. పూర్ణచందు భాషా చైతన్యం కలిగిన రచయిత. తెలుగు భాష మూలాలు తవ్వి పరిశోధకులకు కావలసిన ముడిసరుకు తట్టలకెత్తి తెచ్చి అందించిన పరిశోధకుడు. భాషోద్యమ ముఖ్యులలో ఒకడు. మహాత్ముడి 150 జయంతి ఉత్సవాలు పురస్కరించుకుని డా॥ పూర్ణచందు ఈ పుస్తకాన్ని వెలువరిస్తున్నాడు. పుస్తకంలో ఎక్కడా రచయిత కనిపించకుండా, అక్షరం అక్షరం గాంధీని మన కళ్లముందు నిలబెట్టడం ఈ పుస్తకంలో విశేషం.

వందేళ్ల క్రితం మహాత్ముడు మాతృభాష గురించి చెప్పిన అనేక హితవచనాలను నేటి పరిస్థితికి అద్భుతంగా అన్వయిస్తూ చేసిన ఈ **"మాతృభాష-మహాత్ముడి బాట"** పుస్తకం భాషోద్యమానికి ఒక కరదీపిక లాంటిది.

భాషోద్యమం తెలుగు నేలపైన పుట్టిన ఈ 18 యేళ్లుగా ఆ ఉద్యమంతో మమేకమై, మహాభారతంలో 18 పర్వాల మాదిరిగా సాగిన అనేక పరిణామాలకు సాక్షిగా, పాత్రధారిగా, మార్గదర్శకుడుగా వ్యవహరించిన డా. పూర్ణచందు తన అనుభవం కొద్దీ ఈ పుస్తక రచన చేశాడు. గాంధీ మహాత్ముడి మాట మీద, బాటమీద తనకు గల నిబద్ధతని ఈ పుస్తకం ద్వారా చాటుకున్నాడు. *మాతృభాషాభిమాని డా॥ పూర్ణచందుని మనసారా అభినందిస్తున్నాను.*

# మాతృభాష- మహాత్ముడి బాట

*డా. జి వి పూర్ణచందు*

**1915** ఏప్రియల్ 21న మద్రాసులో గాంధీజీ ఆంధ్రపత్రిక విలేకరితో సంభాషించినప్పుడు మాతృభాషల గురించి ఆయన అభిప్రాయాలు స్పష్టమైనాయి.

"నాతో అన్ని భాషలవారూ ఉన్నారు. అందులో ద్రావిడభాషలు మాట్లాడేవారూ ఉన్నారు. హైందవభూమి మొత్తానికి ఏకభాష అనేది సాధ్యం కాగలదు. అది హిందీయేనని నా మతం. దాక్షిణాత్యులు హిందీ అద్భుతంగా నేర్చుకోగలరు. మా ఫోనిక్స్ ఆశ్రమంలో గోవిందస్వామిగారి భార్య ఆంధ్రవనిత. తెలుగు, అరవం, హిందీ ఇంగ్లీషు, జూలూ భాషలను ఆమె అవలీలగా మాట్లాడగలదు. ఆమె పుత్రికలకూ ఈ భాషలు వచ్చు. మనదేశీయులకు ఇతర భాషలు సులువుగా పట్టుపడగలవు".

"ఇప్పటి పరిస్థితి చూస్తే ఇంగ్లీషే ప్రాబల్యంలో ఉంది. మనం దేశభాషలను అలక్ష్యం చేసి, దురవస్థలపాలు జేసినంతకాలం ఈ ప్రాబల్యం హెచ్చుతూనే ఉంటుంది. ఈ స్థితి గౌరవప్రదం కాదు. మన లోపాలను కూడా సహించటం తప్పే. మొగలాయీల పాలనలో వారి భాషను అంగీకరించాము కాబట్టి, ఇప్పుడు ఆంగ్లేయులపాలనలో వీరి భాషను అంగీకరించాలనటం తప్పు. ఇది ఎలాంటి లోపమో అదికూడా అలాంటి లోపమే!".

"దేశభాషలను నేర్చుకోవటం విద్యావంతుల విధి. ప్రతీ ఒక్కరూ విధిగా ఏదైనా భారతీయ భాషను నేర్చుకోవాలనేది నా అభిమతం. నేను అరవం, తెలుగు నేర్చుకుని మీతో సంభాషించగలను. మీరూ హిందీ నేర్చుకుని నాతో సంభాషిస్తే సంతోషిస్తా!"

"పది సంవత్సరాల కాలంలో ప్రతీ భారతీయ విద్యార్థి తన మాతృభాషనీ, సంస్కృతాన్నీ, హిందీని, ఏదైనా ఒక ద్రావిడ భాషనీ, వీటితోపాటు ఇంగ్లీషుని

కూడా నేర్చుకోవటం పెద్ద కష్టమేమీ కాదు. ఆ భాషలలో సంపూర్ణ పాండిత్యం అవసరమూ కాదు. జీవిక కోసం ఆంగ్లేయులతో మనం సంభాషించటానికి అవసరమైనంత ఇంగ్లీషు వస్తే చాలు. గుమస్తా ఉద్యోగాలు చేయటానికి ఇంగ్లీషు పాండిత్యం అవసరం లేదు. ఇప్పటి విద్యావ్యవస్థలో అంతటి ఆంగ్ల పండితులుగా విద్యార్థుల్ని తయారు చేయగలరని ఆశించే పరిస్థితీ లేదు. విద్యావంతులైన భారతీయులు ప్రపంచ విజ్ఞాన శాస్త్రాలను మాతృభాషలలోకి అనువాదం చేస్తారు. ఆ ప్రచురణలే మన వాఙ్మయం కాగలవు. దీనిని నేను నా కార్యక్రమాలలో ఒకటిగా చేయదలచాను".

"సాంకేతిక పదాలను దేశభాషలలోకి సృష్టించవలసిన అవసరం ఉంది. ఆంగ్లం నుండి కూడా తీసుకోవల్సిన అవసరమూ ఉంది. స్టీమరుని దక్షిణాఫ్రికాలో భారతీయులు "ఆగ్‌బోట్" అంటారు. ఆగ్ అంటే అగ్గి. బోట్ అనేది ఇంగ్లీషుపదం. ఈ సమాసాలు జనవ్యవహారాల్లో ఉన్నప్పుడు వాటిని యథాతథంగా ఉపయోగించుకోవటమూ సబబే! మొత్తం మీద అవసరాన్ని మించి దీర్ఘసృష్టి చేయక లఘుపద్ధతిలో సాంకేతిక పదాలను మాతృభాషల్లో అధ్యయనం చేయటానికి ప్రయత్నించాలి" (ఆంధ్రప్రదేశ్‌లో గాంధీజీ-సం. శ్రీ కొడాలి ఆంజనేయులు).

1915లో దక్షిణాఫ్రికానుండి గాంధీజీ తిరిగి వచ్చిన నాటి ఆయన ఆలోచనలివి. భారత రాజకీయ ముఖచిత్రం మీద ఆయన ముద్ర ఇంకా ప్రసరించ లేదప్పటికి. ఆనాటికే అవసరం పడి, ఈనాటికి నెరవేరని కలలే అవి!

## మనభాషలో మన చదువులు

"మన సమాజంలో పెద్దపెద్దవారితో కలసిమెలసి తిరగాలంటే పిల్లలకు ఇంగ్లీషు విధిగా నేర్పించాలని తల్లిదండ్రులు వ్యామోహపడటం వలన జాతికి ముప్పు తెచ్చిన వారౌతారు. ఈ విధంగా తల్లిదండ్రులు ఆలోచించటం సిగ్గుచేటని నేను భావిస్తాను. ఇంగ్లీషు భాషావ్యామోహం నశిస్తేగానీ, సంపూర్ణ స్వరాజ్యం సిద్ధించదు". (యంగ్ ఇండియా. 12-07-1920).

ప్రస్తుత విద్యావిధానంలో మూడు ముఖ్యలోపాలు కనిపిస్తున్నాయన్నారు గాంధీజీ.

1. విదేశీయ సంస్కృతిపైన ఆధారపడి దేశీయ సంస్కృతిని పూర్తిగా విస్మరించి, హృదయగత సంస్కృతి నిర్లక్ష్యం
2. చేతి విద్యను త్రోసిపుచ్చి కేవలం మనసును మాలీసు చేయటం.
3. ప్రాథమికస్థాయిలో పరాయిభాషలో బోధించి విద్యార్థిని ఇంగ్లీషువాడిగా మార్చాలనుకోవటం.

ఈ మూడులోపాల గురించీ మహాత్ముడు పదేపదే హెచ్చరించారు.

ఆంగ్లేయ విద్య కొంతమంది దేశభక్తుల్ని, స్వార్థత్యాగుల్ని తయారు చేసిన మాట నిజం. కానీ, వీరితోపాటు ప్రభుత్వానికి సహాయపడే గుమాస్తాలనీ, దేశాన్ని దాశ్యంలో ముంచెత్తేవారినీ, వేలకు వేలుగా తయారు చేసింది" (యం.ఇం. 23-12-1926).

"మాతృభాషలో కాకుండా పరభాషలో చదివే పిల్లలు ఎక్కువమంది ఆత్మహత్యలకు పాల్పడతారని నమ్ముతున్నాను. పరాయి చదువు పిల్లల జన్మహక్కును హరిస్తుంది. విదేశ బోధనాభాష అంటే పసికందుల నెత్తిన వారి స్వంత మేథాశక్తిని చంపే బండనెత్తడమే! అది వారి పురోభివృద్ధికి నిరోధం కలుగజేసి, స్వగృహం నుండి వేరుపరుస్తుంది. అందువల్ల అలాంటి విషయాలు ప్రథమశ్రేణికి చెందిన జాతీయ వినాశకాలుగా నేను పరిగణిస్తాను" (సింహళంలో గాంధీజీ).

"విదేశీ భాషల్లో విద్య గరపడం వలన జాతీయశక్తి సంపదలు నీరసిస్తున్నాయి. విద్యార్థులు అకాల మృత్యువాత పడ్తున్నారు. ప్రజలకు దూరమౌతున్నారు. వృథాగా విద్యకు ఎక్కువ ఖర్చవుతోంది. విద్యావిధానం ఇలానే కొనసాగితే జాతి నశించిపోతుంది. దేశీయుల్ని దేశానికి పనికి రానీకుండా చేసే విద్య దేనికి?" (యంగ్. ఇండియా 5-7-1928).

"విద్యార్థుల ఎరికలోనో, పరిసరాల్లోనో కనిపించే అంశాలు పాఠ్యాంశాలుగా ఉంటే ప్రాథమిక విద్య స్థాయిలో నేర్పించేది వాళ్లకు తేలిగ్గా వంటబడ్తుంది. గృహజీవితం లోని మంచిచెడ్డల్ని పాఠ్యపుస్తకాల ద్వారా విద్యార్థులు నేర్చుకోవటానికి వీలౌతుంది. మన పరిసరాల గురించి మనం గర్వించే విషయాలు వారి మనోప్రవృత్తిని పెంపు చేస్తాయి. కానీ, ప్రాథమిక విద్యలో దేశీయత కరువైతే, క్రమేణా మాతృభాషాసంస్కృతులకు దూరం అవుతూ, చివరకు చదువు పూర్తయ్యేసరికి స్వగృహం ఒక వింతగా అనిపించే పరిస్థితి ఏర్పడుతుంది. జీవనమాధుర్యం ఏదీ కనిపించదు. దేశీయ సోయగాలు మరుగున పడిపోతాయి. తమ సంస్కృతి, తమ భాష, తమ దేశం తక్కువైనవని, తమ ప్రజలు మొరటు, నాటు అనీ అనుకుంటారు. వారిని అభిమానించి, ఆదరించి, వారికోసం జీవించాలనే ఆలోచన లేకుండా పోతుంది. తమ దేశీయత ఈ ప్రపంచానికి ఏమీ ఉపకరించదనుకుంటారు. తమను ఉద్ధరించటానికే ఇంగ్లీషు విద్య వచ్చిందని భావిస్తారు. ఆ భావనలోనే చదువును, జీవికను కొనసాగిస్తారు...."

"విదేశీభాష మనపిల్లల్ని స్వంతదేశంలో విదేశీయులుగా మార్చేసింది. అది ప్రస్తుత విధానపు ఘోర వినాశం. దేశీయ భాషల వికాసానికి విదేశభాషే అడ్డుగా ఉంది.

నేనే నియంతనైతే మన పిల్లలకు విదేశభాషల్లో బోధన అరికట్టి, ఆచార్యుల్నీ, ఉపాధ్యాయుల్నీ బర్తరఫు చేసే భయంతో మాతృభాషలోకి మార్పు ప్రవేశపెట్టే వాణ్ణి.(యం ఇం.1/09/1921).

"అవసరమైనంతవరకే ఆంగ్లం" అనే మహాత్ముడి సిద్ధాంతాన్ని విస్మరించి నిర్బంధ ఆంగ్లవిద్య దేశభక్తిగా చెలామణి కావాలని కొందరు ఆరాటపడ్తున్నారు. ఒకక్లాసు ఆంగ్లం సరిపోదని చెప్తూ 'ఒకక్లాసు'కు తెలుగుని పరిమితం చేయాలని చూస్తున్నారు. ఈ అలుసు తీసుకుని కార్పోరేట్ విద్యాసంస్థలు ఆ ఒక క్లాసుతెలుగుని వారానికి ఒక క్లాసు, ఆ తరువాత నెలకొక క్లాసు అని ఏమార్చినా దిక్కు ఉండదు.

## మాతృభాషే జీవశక్తి

"మన సంస్కృతిలోని ఉన్నతి ఇతర సంస్కృతులకన్నా ఉన్నతమైందని నా అభిప్రాయం. మన ఉన్నతి ఏమిటో మనకు తెలియకపోవటాన దానిని తెల్సుకోవటానిక్కూడా అసహ్యించుకునే ధోరణి ప్రదర్శిస్తోన్నాం. కాబట్టి, దాని విలువ మనకు తెలియదు. మన సంస్కృతి ననుసరించి నేడు మనం జీవించలేక పోవటానికి సంస్కృతి పుస్తకాల్లో మాత్రమే ఉండటం, ఆ పుస్తకాల్ని ఏనాడు మనం తెరవకపోవటం కారణాలు. పరిమళ ద్రవ్యాలతో భద్రపరచిన శవంలా మన సంస్కృతి పడి ఉంది. చూడటానికి బాగానే ఉంటుంది. కానీ ఉత్తేజం ఉత్సాహం ఉండవు". (యం. ఇం. 1-9-1921).

వ్యక్తి ఏ భాషాజాతీయతకు, ఏ సాంస్కృతిక వారసత్వానికి, ఏ ప్రాంతానికి చెందినవాడో అతని భాష చెప్తుంది. అతని జాతీయతను, అతని ఉనికిని, అతని అస్తిత్వాన్నీ వ్యక్తపరుస్తుంది. వ్యక్తి అస్తిత్వం అతని మాతృభాష వలనే ఋజువౌతుంది. మాతృభాషను పదిలపరచుకోవటం ద్వారా వ్యక్తి తన ఉనికిని తానే నిలుపుకుంటున్నాడు.

"విద్య గ్రామీణుల అవసరాలు తీర్చేదిగా ఉండాలి. కొల్లగొట్టుకుతినే సామ్రాజ్యవాదు లకు సహాయకారిగా ఉండకూడదు. చేతులు, కాళ్లు, ముక్కు, చెవులు, మొదలైన అవయవాలన్నీ సక్రమస్థితిలో ఉంటేనే బుద్ధి వికశిస్తుంది. శరీరంతో పాటు మనసూ వికసించాలి. బుద్ధి, మనసులతో పాటు అంతరాత్మిక బలం కూడా పెరగాలి. అది విద్య అందిస్తుంది. అంతరాత్మిక బలం లేకుండా శరీరాభివృద్ధి, మానసికాభివృద్ధి సాధ్యంకావు"(యం. ఇం. 21-8-1937).

మాతృభాషే జీవశక్తిని అందిస్తుంది. ఆత్మికశక్తి, మనోవికాసాలను విద్యార్థులు తమకు తాముగా పెంపుచేసుకుని ఉన్నత పౌరులుగా ఎదిగేలా చేసే విద్య మనకు

కావాలి. అది మాతృభాషలోనే సాధ్యం. కనీసం ప్రాథమిక స్థాయిలోనైనా దానిని చాలినంత నేర్పించాలంటారాయన. సామాజిక, సాంస్కృతిక, సమాచార మార్పిడి. సామాజిక బంధాలు ఏర్పడటం, సామాజిక అభివృద్ధి అనే అంశాలు కూడా అమ్మభాషతో ముడిపడి ఉంటాయి. విద్య వీటన్నింటిలోకీ ముఖ్యమైంది.

ఏ భాష అయినా communication దాని ప్రధాన లక్ష్యం. ఒక మాతృభాషని సమాచార మార్పిడికి పనికి రానిదిగా ముద్రవేయటం జాతిద్రోహమే! ప్రాథమిక విద్యను అమ్మభాషలోనే నేర్పించవలసిన అవసరాన్ని విద్యారంగం విస్మరించటం వలన విద్యార్థుల్లో గ్రహణశక్తి తగ్గుతుంది.

పుడుతూనే పిల్లలు ఇంగ్లీషులో ఏడవాలని కోరుకునే కొందరు తల్లిదండ్రుల అత్యాస, ఇంగ్లీషు తోనే effective communication సాధ్యం అనే అపోహ రెండూ మాతృభాషను దెబ్బతీస్తున్న అంశాలు.

వివిధ భాషాసంస్కృతుల మధ్య సమన్వయం సాధించటం, అందరికీ సమానమైన, నాణ్యమైన విద్య నందించటం, జ్ఞానసమాజాలను (knowledge Societies) నిర్మించటం, సాంస్కృతిక వారసత్వాన్ని పరిరక్షించటం, సాంకేతిక విజయాలు అందరికీ సమానంగా అందేలా చేయటానికి కావలసిన రాజకీయ నిర్ణయశక్తిని (political will) సాధించటం ముఖ్యం అంటారు గాంధీజీ.

## శాస్త్ర సాంకేతికత-ఆంగ్ల మాధ్యమం

"పిల్లల్లో మాతృభాషంటే ద్వేషం కాకుండా ప్రేమ, గౌరవం కలిగించే విద్యావ్యవస్థ కావాలి"

"నా దేశీయుల కోసం నేను ఇంగ్లీషులో మాట్లాడవలసి వస్తున్నందుకు ఎంతో సిగ్గుపడతాను. ఎంతో చిన్నతనం అనిపిస్తుంది. అవమానపడతాను." (యం. ఇం. 5-7-1928).

"నాకు జీవనాధారమైన క్షీరమిచ్చేది మాతృభాష మాత్రమే! ఆంగ్లభాషను దాని స్వస్థానంలో నేను ప్రేమిస్తాను. అయితే దానికి చెందని స్థానం అన్యాయంగా పొందితే దానికి బద్ధవిరోధిని. ఆంగ్లం నేడు ప్రాపంచిక భాష అనటంలో సందేహం లేదు. అందువల్ల దానికి నేను పాఠశాలస్థాయి విద్యలో కాకుండా విశ్వవిద్యాలయ తరగతులలో ద్వితీయాభిమానభాషా స్థానం ఇస్తాను. అది ఏదో కొద్దిమందికే తప్ప కోట్లాది ప్రజలకు కాజాలదు. నిర్బంధ ఉచిత ప్రాథమిక విద్యావిధానం ప్రవేశపెట్టే స్తోమతు లేని ప్రస్తుత పరిస్థితుల్లో మనం ఆంగ్లబోధనకు ఎలా అవకాశం కల్పిస్తాం?

ఆంగ్లభాషా ప్రమేయం లేకుండానే, రష్యా తన శాస్త్రీయ ప్రగతినంతనీ సాధించింది. మన మానసిక దాస్యమే ఆంగ్లభాషా సంపర్కం లేకుండా మనం పురోగమించలేమనే భావన కలిగిస్తోంది. జాతిని ఇలా పరాజితుల్ని చేసే విధానాన్ని నేనెప్పటికీ అంగీకరించను" (25-08-1946 హరిజన్).

పరాయిభాషలో ఉన్న శాస్త్ర విషయాల్ని మనం స్వంతం చేసుకునేప్పుడు, దాని సాంకేతిక పదాలను కూడా స్వంతం చేసుకోవాలి. లేదా తత్సమానమైన అర్థాన్నిచ్చే సాంకేతిక పదాల్ని మాతృభాషలో సృష్టించుకోగలగాలి. మహాత్ముడుకి ఈ విషయంలో నిర్దిష్టమైన అభిప్రాయాలున్నాయి. పరాయి భాషల్లోని పదాలెన్నింటినో తనలో ఇముడ్చుకుని ఇంగ్లీషు భాష నేడు గొప్పగా వెలుగుతోందనీ, మాతృభాష విషయంలో మనం అదే అనుసరించాలనీ ఆయన అన్నారు (హరిజన్1-2-1942).

ఇంగ్లీషు లేకపోతే శాస్త్రీయ విజ్ఞానమే లేదని వాదించేది విచిత్ర వాదన. శాస్త్ర సాంకేతిక పదాలన్నీ ఇంగ్లీషు పదాలనే అపోహ వలన ఈ భావన కలుగుతోంది. వాటిలో గ్రీకు, లాటిన్, ఫ్రెంచి పదాలే ఎక్కువ. పాలనా పదాల్ని ఎక్కువగా ఫ్రెంచి నుంచి ఇంగ్లీషులోకి ఎరువు తెచ్చుకున్నారు. కాబట్టి, పారిభాషిక పదాలకు సమానమైన పదాలు ఇతర మాతృభాషల్లో ఉండి తీరాలనే నియమం లేదు. పచ్చిపులుసుకు సమానమైన పదం ఇంగ్లీషులో ఉన్నదా? అలాగే, మనవి కాని వాటికి మన భాషలో పదాలుండవు. లేనప్పుడు వాటిని మాతృభాషలో సరళంగా అనువదించటానికి ప్రయత్నించాలన్నారు మహాత్ముడు.

గాంధీజీ ఒకసారి చంపారను వెళ్లారు. అక్కడి ప్రజలు ఒక్క విదేశీ పదం కూడా లేకుండా సునాయాసంగా తమ మాతృభాషలో మాట్లాడటాన్ని గమనించారు "వాళ్లు మోటారుకారును 'హవాగాడి' అనటం నాకెంతో ముచ్చటేసింది. ఇంతకన్నా మృదుమధురంగా పదాల్ని తయారు చేయమని నేను మాతృభాషల పండితుల్ని కోరుతున్నాను" (హరిజన్ 01-08-1946).

చైనా, జపాన్, కొరియా, రష్యా మొదలైన సాంకేతికాభివృద్ధి సాధించిన దేశాలు తమ మాతృభాషల్లో నూతన సాంకేతికతను పనిచేయించుకో గలుగుతున్నప్పుడు భాషాపదాల అడ్డంకిని వాళ్లు ఎలా అధిగమించగలిగారో తెలుసుకోవాలి!

"సాంకేతికత దేశభాషల్లో లేకపోతే జాతి పునర్నిర్మాణంలో సగటు మానవుడి పాత్ర లేకుండా పోతుంది" అనేవారాయన. ఇంగ్లీషు చదువులు గుమాస్తాలను తయారుచేసేవేగాని, యజమానులుగా తీర్చిదిద్దేవికాదని ఆయన పదేపదే చెప్పేవారు. "అనుచర వంశాన్ని తయారు చేసే ఏ దేశమూ ఒక జాతి కానేరదు" అన్నారు. అనుచరుల్ని కాదు, నాయకుల్ని తయారు చేసే విధానం కావాలన్నారు.

1942 ఫిబ్రవరి 1 సంచిక 'హరిజన్'లో "జపాను ఉదాహరణ" వ్యాసంలో గాంధీజీ ఇలా వ్రాశారు :

"జపానులో ఏమి జరిగిందో మీకు విదితమే! జపానీయ పాఠశాలలోను, కళాశాలలోనూ వేలాదిమంది బాలబాలికలు ఆంగ్లంతో ప్రమేయం లేకుండా జపానీభాష ద్వారా విద్యనభ్యసిస్తారు. వారి లిపి కష్టతరమైనదైనప్పటికీ వారు నిరంతరాయంగా నేర్చుకోవచ్చు. రోమనుభాష కోసం వారు దానిని స్వస్తి చెప్పలేదు కూడా! అంతమాత్రంచేత వారు ఆంగ్లం, ఇతర యూరోపియన్ భాషలను నిషేధించారని కాదు. వారు తమ శక్తిని దుర్వినియోగపరచటం లేదంతే!"

"పాశ్చాత్యులు వెదజల్లగల విజ్ఞానం నుంచి జపానీయ ఆలోచనను ప్రవృద్ధి చేయటం జపానీయుల లక్ష్యం. పాశ్చాత్యుల నుంచి గ్రహించతగ్గ దాన్ని జపానీయంగా మార్చటంలో వారు శ్రద్ధ వహిస్తారు. జపాను యువకుల మనస్సు తాజాగానూ చలాకీగాను ఉండడమే దీనికి హేతువు. ఆ విధంగా సముపార్జించిన జ్ఞానం జాతీయ ద్రవ్యం అయిపోతుంది".

పాశ్చాత్యుల జ్ఞానాన్ని అలవరచుకునే అవకాశం పొందినవారు మాతృభాషా జ్ఞానాన్ని వదులుకోవటం వలన జపానులో సాధించిన జాతీయ జ్ఞానాన్ని మన దేశంలో సాధించలేకపోతున్నామని గాంధీజీ పదేపదే హెచ్చరించారు.

"ఆంగ్లేయుల యొక్క రాజకీయ దురాక్రమణను మనం పారద్రోలిన రీతిలోనే ఆంగ్లభాషయొక్క సంస్కృతీ దురాక్రమణను కూడా పారద్రోలవలెనని నా వాదన. అంతర్జాతీయ వ్యాపారానికి, రాజకీయాలకు మాత్రం మిక్కిలి అనుగుణ్యత కలిగిన ఆంగ్లభాషకు ఆ స్థానం ఎలాగూ మిగులుతుంది".

"పశ్చిమ దేశాలను అనుకరించటంచేత మన గౌరవ మర్యాదలు కోల్పోయాం. మనం ఆంగ్లంలో ఆలోచిస్తాం. ఆంగ్లంలో మాట్లాడుతాం. అందువలన మన మాతృభాష సన్నగిలి మూలపడుతోంది. మన మాట తీరుకు జనం అసహ్యించుకునేలా చేస్తున్నాం. దేశసేవకు ఆంగ్ల భాషాపాండిత్యం అవసరం లేదు." (గాంధీజీ ఉపన్యాసాలు వ్రాతలు -110).

"భాష మానవ సృష్టి! సృష్టికర్తలు ఏయే మెరుగులను భాషకు దిద్దితే ఆ మెరుగులతోనే భాసిల్లుతుంది. ప్రతీ భాషా అలాగే అపరిమితంగా పెరుగుతుంది" హరిజన్ 8-2-1942.

శాస్త్ర, సాంకేతిక విషయాలు, న్యాయశాస్త్ర పరమైన అంశాలలో సాంకేతిక పదాలను మాతృభాషలలోకి తీసుకు రావటానికి అమితమైన పరిశోధన, పరిశ్రమ

అవసరం అన్న సలహాను గాంధీజీ వ్యతిరేకించారు. అలా వాదించేవాళ్లకు మన గ్రామాలలోని భాషలలో నిక్షిప్తమైన నుడికారాలు, నానుడుల అఖండభాండాల గురించి తెలియదన్నమాట. కొత్త పదాల కోసం సంస్కృతాన్నిలేదా పర్షియన్ని ఆశ్రయించాల్సిన అవసరం లేదన్నారు గాంధీజీ.

ప్రతీ భారతీయుడూ ఆంగ్లభాష ద్వారా జ్ఞానం సంపాదించుకోవటానికి జీవితంలో అధమం ఆరు సంవత్సరాలైనా కోల్పోతున్నారని గాంధీజీ ఒక సందర్భంలో అన్నారు. ఒక విదేశీ భాషాధిపత్యానికి మనం వెలలేని సంవత్సరాలను వెచ్చించేప్పుడు మనలో శ్రద్ధాసక్తులు ఉంటాయని ఎలా అనుకుంటాం? అని ప్రశ్నించారాయన.

మాతృభాషను మరిచిపోయే విధంగా, ఇంగ్లీషు చదువుల వలన సృజనాత్మకమైన పరిశోధనల మీదగానీ, లోతైన ఆలోచనల మీద గానీ, శ్రద్ధ లేకుండా పోతుందని గాంధీ ఎంతో దూరదృష్టితో ఊహించి చెప్పారు. ఇంగ్లీషులో చదూకున్న వారికన్నా మాతృభాషలో చదివిన వారికి సాహసోపేత నిర్ణయాలు తీసుకోవటం లోనూ, కొత్త ప్రణాళికలు రూపొందించుకోవటం లోనూ, కొత్త పథకాలకు సిద్ధం కావటం లోనూ ఆధిక్యం ఉంటుందని, ఇంగ్లీషులో చదువుకున్న మనం దాని నష్టాన్ని గుర్తించలేకపోతున్నామని గాంధీ అన్నారు.

## మాతృభాషలు- జాతీయవిద్య

"నా అభిప్రాయాలను కొంతమంది తీవ్రంగా విమర్శిస్తున్నారు. విదేశీ భాషకు నేను విరోధి నంటున్నారు. విదేశీయ సంస్కృతిని నేను నిరసిస్తున్నా నంటున్నారు".

"మన భాషను మనం ముందుగా నేర్చుకోవాలి. మన సంస్కృతిని జీర్ణింపచేసుకోవాలి. అటుపిమ్మట, ఇతప భాషల్లోని ఇతర సంస్కృతుల్లోని గొప్పతనాన్ని నేర్చుకోవాలి. ఇది విద్యాభ్యాసం యొక్క క్రమవిధానం. ముందు విదేశీ సంస్కృతి నేర్పుతాం, ఆ తరువాత మన సంస్కృతి నేర్పుతామంటే ఏ సంస్కృతీ మనకు అందకుండా పోతుంది".

"నిజమైన జాతీయ విద్యలో సమకాలీన జాతీయ పరిస్థితి ప్రతిబింబించాలి. దేశీయత ప్రతిధ్వనించాలి. నేనూ-నా దేశం-నా జాతి-నా ప్రజలు-నా భాష అనే భావనలు కలగాలి. "నేను - నా పొట్ట" అనే ధోరణి కలిగించే చదువులు మనకొద్దు".

"ఆంగ్లభాష చారిత్రక, రాజకీయ కారణాల వలన ప్రపంచభాష తాహతు పొందింది. అందువలన విద్యావంతులందరూ దాన్ని తప్పనిసరిగా నేర్వవలసి ఉంది. అందుకని, మాతృభాష తర్వాత వైకల్పిక భాషగా ఇంగ్లీషుకు రెండవ స్థానం ఇస్తాను".

"ఇంగ్లీషుభాష అంతర్జాతీయ వ్యాపారరంగంలో వాడే భాష. అది రాజనీతివేత్తలు వాడే భాష. అది సారస్వత గని. పాశ్చాత్యుల భావాలు, సంస్కృతులను తెలుసుకునేందుకు ఉపకరించే భాష కాబట్టి, ఇంగ్లీషుభాషను మనలో కొంతమందైనా తప్పనిసరిగా నేర్చుకు తీరాలి. ఇంగ్లీషు నేర్చిన వీళ్లు ఇంగ్లీషు మాత్రమే అవసరమైన జాతీయ వాణిజ్య వ్యాపార రంగాలలో, అంతర్జాతీయ రాజకీయ శాఖలలో పనిచేస్తారు. పాశ్చాత్య సాహిత్యాన్ని, వారి ఆలోచనాపరంపరలను, శాస్త్రవిజ్ఞానాన్ని శోధించి మన జాతికి ఉపకరించేవిగా చేస్తారు."

గాంధీగారి ఈ వాక్యాలన్నీ 80-100 యేళ్ల క్రితం నాటివి. అప్పటికన్నా సామాజికంగా ఇంగ్లీషు అవసరం పెరిగినమాట వాస్తవం. కానీ, జాగ్రత్తగా గమనిస్తే ఇంగ్లీషు వాడకమే పెరిగింది గానీ ఇంగ్లీషు అవసరం పెరగలేదు. ఇంగ్లీషుతో పనిలేని చోట కూడా ఇంగ్లీషుని మాత్రమే వాడటం పెరిగింది. అదే నాగరికత అనుకోవటంలోనే మన భావదారిద్ర్యం దాగి ఉంది.

విశ్వకవి రవీంద్రుడు గీతాంజలి ప్రార్థన గీతంలో Strike! strike! At the root of penury in my heart" అంటాడు. పెన్యురీ ఆఫ్ హార్ట్ అంటే భావదారిద్ర్యం అని! దాన్ని మొదట తొలగించుకోవాలి!

"నేడు ఇంగ్లీషు భాష మన హృదయాల్లో పాతుకు పోయింది. అది మన మాతృభాష స్థానంలో ప్రవేశించింది. పూర్తిగా మన మాతృభాషను బయటకు నెట్టింది. మనకు ఇంగ్లీషువాళ్లతో సంబంధాలు సహజమైనవీకావు, సమమైనవీ కావు. ఇంగ్లీషు భాష నేడు అస్వాభావిక స్థానంలో తిష్ఠ వేసింది. భారతీయుల మనసు సర్వతోముఖంగా వికసించాలంటే ఇంగ్లీషు కాకుండా మాతృభాషను సేవించాలి. ఏ పక్షానికి గాని, వర్గానికిగానీ, బాధ లేకుండా దేశం మొత్తానికి అనుకూలమైన భాషను నేర్వడానికి ఇష్టపడని కొంతమంది బద్ధకస్తుల కోసం దేశానికీ. సంస్కృతికీ విషయకంగా నష్టదాయక మైన ఆంగ్లభాషను అంతరపాలనాభాషగా చేయటానికి ప్రభుత్వం సాహసించకూడదు" (గాంధీజీ ఉపన్యాసాలు వ్రాతలు110).

## ఆంగ్లభాషకు దాస్యం

స్వాతంత్ర్యం వచ్చాక ఆంగ్లభాషకు దాసోஉహం పలికిన రాష్ట్రప్రభుత్వాల నిర్వాకం ఎంతటిదో పరిశీలిస్తే నిజాలు ఆశ్చర్యం గొలుపుతాయి. అండమాన్ దీవులు, అరుణాచలప్రదేశ్, చండీఘర్, గోవా, జమ్ము కాశ్మీరు, మణిపూర్, మేఘాలయ,

మిజోరం, నాగాలాండ్, సిక్కింలలో ఇంగ్లీషు 1వ భాషగా ఉంది. అస్సాం, ఒడీసా, ఉత్తరాఖండ్, పశ్చిమబెంగాల్ రాష్ట్రాలలో ఇంగ్లీషు 3వ భాషగా ఉంది. బీహార్, జార్ఖండ్, ఉత్తరప్రదేశ్ రాష్ట్రాలలో ఇంగ్లీషు 4వ భాషగా ఉంది. తక్కిన రాష్ట్రాల్లో ముఖ్యంగా దక్షిణాది రాష్ట్రాల్లో ఇంగ్లీషు 2వ భాషగా చెలామణి అవుతోంది.

ఇంతటి ప్రతికూల పరిస్థితులు ఉన్నా, దేశంలో ఇంకా దేశభాషల మాధ్యమాలలో పనిచేసే విద్యాలయాలు ఉన్నాయి. మాతృభాషలలో చదువుకునే విద్యార్థులూ ఉన్నారంటే ఆశ్చర్యం కలుగుతుంది. దేశవ్యాప్తంగా మాతృభాషల్లో చదువుతున్న విద్యార్థుల సంఖ్య ఈ విధంగా ఉంది:

| | |
|---|---|
| హిందీ | 6,62,31,904 |
| బెంగాలీ | 1,04,62,343 |
| మరాఠీ | 79,18,420 |
| గుజరాతీ | 51,59,916 |
| తెలుగు | 47,71,981 |
| ఒడిసా | 39,82,338 |
| కన్నడ | 37,40,803 |
| తమిళం | 36,50,278 |
| అసామీ | 31,54,842 |

తెలుగు మాధ్యమంలో చదివే విద్యార్థులు, చదవగోరే విద్యార్థుల సంఖ్య గణనీయంగానే ఉందని ఈ పట్టిక చెప్తోంది. వారి పైన ఇంగ్లీషు వ్యామోహం, విదేశీ ఆశలు తెచ్చి రుద్దటం విద్యావ్యవస్థలో ప్రమాదకర ఘటన.

## మాతృభాష ధ్యాస

ప్రభుత్వం చేయటానికి వచ్చిన వ్యక్తులకు "మాతృభాష ధ్యాస" ఉండాలంటారు మహాత్ముడు. "మన ప్రభుత్వాలు, వాటి కార్యాలయాలు తగిన జాగ్రత్త పడకపోతే ఆంగ్లభాష హిందూస్థానీ స్థానాన్ని ఆక్రమించ గలదు. అందువలన ఆంగ్లభాషను ఎన్నటికీ నేర్చుకోలేని లక్షలాది జనసామాన్యానికి తీరని హాని కలుగుతుంది. భారత దేశంలో ప్రాంతీయ భాషల సంపదను పునరుజ్జీవింప చేయటం ప్రభుత్వం ముందున్న తక్షణ కర్తవ్యం. మన కోర్టులలోనూ, స్కూళ్లలోను, సెక్రటేరియట్లలోనూ ఈ మార్పు తేవటానికి కొంతగడువు అవసరం అని వాదించటం మన అలసత్వాన్ని మాత్రమే తెలుపుతుంది".

"దేశీయ భాషల ప్రతిపత్తినీ, గౌరవాన్నీ పెంపొందించటానికి న్యాయస్థానాలలో ఆయా రాష్ట్రాల భాషల ద్వారానే వ్యవహారాల్ని నిర్వహించాలని నా అభిప్రాయం. శాసనసభల కార్యకలాపాలు ప్రాంతీయ భాషలో కానీ, దేశంలో వ్యాప్తిలో ఉన్న బహుభాషలలో కానీ కొనసాగించాలి".

"భాషా సమస్యను ప్రభుత్వాలు, విద్యావేత్తలు పరిష్కరించవలసిన సమస్య కాదు. ఒక ప్రాంతానికి చెందిన పిల్లలకు ఏ స్థాయిలో ఏ భాషలో బోధించాలో వారు నిర్ణయించకూడదు. దేశీయ పరిస్థితులు, జనాభిప్రాయాలను అనుసరించి బోధించాలి".

"ఈ దేశం వాస్తవంగా స్వతంత్రమైతే బోధనాభాష సమస్య ఒకవిధంగా పరిష్కారం అవుతుంది. విద్యావేత్తలు పాఠ్య సంక్షేపం సిద్ధపరచి తదనుగుణంగా పాఠ్యగ్రంథాలు తయారు చేస్తారు. విద్యాఫలితాలు దేశీయావసరాలకు తగినట్టుగా ఉంటాయి. విద్యావంతుల వర్గానికి చెందిన మనం ఈ సమస్యతో సతమతమయ్యే పర్యంతం మనం కలలుకనే స్వేచ్ఛాయుత ప్రశాంత భారతావనిని సాధించలేమని నా భయం. మనం నిర్విరామ కృషి మూలంగా విద్య, ఆర్థిక, సాంఘిక, రాజకీయ రంగాలలో శృంఖలాలను అధిగమించాలి. సమరంలో నాల్గింట మూడువంతులు ప్రయత్నం మాత్రమే! (హరిజన్ 9-07-1938).

"నేడు మనకు కావలసినది స్వతంత్ర భారతదేశం. మాతృభాషనభ్యసించినవారే నేడు మనకు కావాలి. విదేశ భాష చదివి, దేశంలో పరాయివాడిలా తిరిగేవాళ్లు మనకు అనవసరం. ప్రజల భాషలో మంచి చెడ్డలు చెప్పేవారు కావాలి. కటిక బీదల మధ్య వారు పనిచేయాలి. మన ఉత్తమ భావాలను భార్యలే అర్థం చేసుకోలేని స్థితిలో నేడు పడున్నాం. (యం.ఇం.4-07-29).

మహాత్ముడి మాటల్లో మాతృభాషని ప్రేమించడం అంటే ఆంగ్లాన్ని ద్వేషించడం అని ఎంతమాత్రమూ కాదు. ప్రపంచం కుగ్రామం అయిపోతోంది కాబట్టి, అందరినీ కలిపే భాష ఆంగ్లం అనే విషయంలో గాంధీజీకి అభిప్రాయ భేదం లేదు. పరాయిభాష వారితో ఆంగ్లంలో మాట్లాడటానికి అవసరమైనంత ఆంగ్లం వస్తే సరిపోయేదానికి మాతృభాషను చంపేటంత కఠోరమైన విద్యా వ్యవస్థ తెచ్చి రుద్దటాన్నే ఆయన అంగీకరించలేదు. ఇంగ్లీషులో పాలన వలన ప్రభుత్వాలు ప్రజలకు దూరమౌతాయని ఆయన హెచ్చరించారు. తెలుగుని రద్దు చేసి ఇంగ్లీషులో పాలిస్తేనే మీకు ఓట్లు వేస్తాం అని ప్రజలు అడిగారా?

దేశాన్ని హస్తగతం చేసుకున్నప్పుడు మొదట ప్రజలభాష నేర్చుకుని, ఆ భాషలోనే పాలించాలనే నియమాన్ని బ్రిటిషర్లు పాటించారు. ఆ విధానానికి స్వస్తి చెప్పి,

మెకాలే (Thomas Babington Macaulay) భారతీయు లందరూ ఇంగ్లీషు నేర్చుకుని ఇంగ్లీషు వారిగా మారిపోవాలని హుకుం ఇచ్చాడు. ఈనాటికీ మెకాలేయిజం అమల్లోనే ఉంది.

అధికార భాష మూడు విషయాల్లో అవసరం అవుతుంది. సాధారణ పాలనా రంగం, న్యాయస్థానాలు, విద్యారంగం- ఈ మూడింటిలోనూ తెలుగు స్థానే ఇంగ్లీషు స్థిరపడిపోయింది. దిగువస్థాయిలో రెవెన్యూ, న్యాయస్థానాలు తదితర పాలనావ్యవస్థల్లో పాలనా పారిభాషిక పదాలు ఇంగ్లీషులో చాలినన్ని లేని కారణంగా ఆ రంగాల్ని తెలుగులో వ్యవహారం నడిపేందుకు బ్రిటిషర్లు వదిలేశారు. అంతకు మునుపు మహమ్మదీయ పాలన కారణంగా అరబ్బీ, పర్షియన్ పదాలతో ఆనాటి మన తెలుగు నిండి ఉంది. బ్రిటిషర్లు దానినే న్యాయ, రెవెన్యూ వ్యవస్థల్లో కొనసాగించారు. బ్రిటిషర్లు వెళ్లిపోయినా ఇన్నేళ్లలో తెలుగు పాలనా నుడుల పైన శ్రద్ధ పెట్టలేకపోయాం. ఇందుకు ప్రభుత్వాలు, మేధావులు, విశ్వవిద్యాలయాలు సమాన బాధ్యులే!

క్రీ.శ. 650 నుండి 1750 వరకూ 1100 యేళ్లపాటు అధికారభాషగా ఎంతో కొంత వెలిగిన తెలుగుభాష బ్రిటిష్ యుగంలో కొన వూపిరితో మిగిలింది. స్వంత ప్రభుత్వాలు ఏర్పడ్డాక ఉన్న ఊపిరి కూడా ఆపాలనేవారు పాలకులయ్యారు.

మాతృభాషను తృణీకరించటం మాతృదేవిని తృణీకరించటమేనన్నది మహాత్ముడి ప్రధాన నినాదం! ఈ తృణీకరించే ఆలోచన విద్యావ్యవస్థలోనే ప్రారంభమైంది. చదువు'కొన్న'వాళ్ల బుర్రలో పుట్టిన ఆలోచన ఇది. ఎక్కువ చదువుకున్నానని తెలియాలంటే ఎక్కువ ఇంగ్లీషు మాట్లాడాలనే భావన ఎక్కువ డబ్బెట్టి చదువును కొన్నవాళ్లలో ఎక్కువగా ఉంటుంది.

"ఆంగ్ల భాషపట్ల వ్యామోహం వలన సమాజంలో విద్యావంతులు, రాజకీయ మనస్కులైన వర్గాలకు, సామాన్య జనాలకూ మధ్య పెద్ద అగాథం ఏర్పడింది. మాతృభాషలు మాట్లాడే వారు దుర్బలులనే ఒక దురభిప్రాయం ఏర్పడింది. ఇంగ్లీషులో ఆలోచించి ఇంగ్లీషులో మాట్లాడటానికి అలవాటు పడటం వలన క్లిష్టమైన భావాలను మాతృభాషలో వ్యక్తం చేయటానికి వీళ్లు తబ్బిబ్బు పడుతుంటారు" అని, అవసరం లేని చోట ఇంగ్లీషు వాడేవాళ్ల గురించి అన్నారాయన,!

## కూడు పెట్టే భాషగా అమ్మభాష

ఇంగ్లీషు భాష కూడు పెడ్తుందనే అపోహ కలగటానికి ప్రధాన కారణం విద్యావాణిజ్యమే! తమిళనాడులోనూ, కర్ణాటక తదితర రాష్ట్రాల్లో మాతృభాషల్లో చదువుకున్నవారికి 5-20% వరకూ ఉద్యోగాల్లో రిజర్వేషనిచ్చి కూడు పెడ్తున్నారు. ప్రజల్ని తెలుగులో పాలిస్తూ తెలుగు వచ్చినవారికి ఉద్యోగాలివ్వటం ప్రభుత్వానికి

కష్టం కాదు. అధికార యంత్రాంగం మెకాలే మాదిరే ఆలోచించకుండా ఉంటే సాధ్యమే!

ఆంగ్ల మాధ్యమంలో చదివే విద్యార్థుల తల్లిదండ్రులు అప్పులపాలు అయినా లెక్క చేయక అధిక ఫీజులు చెల్లిస్తారు. ఇంగ్లీషు మాధ్యమం లేకపోతే అధిక లాభాలు రావు కాబట్టి, విద్యాసంస్థల బాగు కోసమే ఇంగ్లీషు మాధ్యమం అని ఎవరైనా ఆక్షేపిస్తే అది గాంధేయవాదానికి అనుసరణీయమైన వ్యాఖ్యానంగానే భావించాలి. గాంధీ మహాత్ముడు ఖండించిందే ఈ విధమైన ధోరణుల్ని. ప్రాథమిక స్థాయిలో తెలుగు బోధనకు వ్యతిరేకంగా ఏ చర్య తీసుకున్నా అది పరోక్షంగా అధిక ఫీజు వసూలు చేసే విద్యాసంస్థలకు అనుకూలంగా తీసుకున్న నిర్ణయమే అవుతుంది. పైకి చెప్పే ఇతర ప్రయోజనాలు ఏవీ నెరవేరవు.

భారతదేశంలో సగటు మానవుడు తన నెలసరి ఆదాయంలో మూడవవంతుని కేవలం పిల్లల చదువుల కోసం ఖర్చు చేయవలసి రావటం బడుగు దేశానికి గర్వకారణం కాదు. చదువుల పేరుతో ఇంత వృథాఖర్చు పనికి రాదన్నారు గాంధీజీ. తల్లిదండ్రుల్ని అప్పులపాలు చేసే ఇంగ్లీషు చదువులు జాతి నిర్మాణానికి దోహద పడేవి కాదు. అమెరికా వెళ్లిపోవటమే లక్ష్యంగా చదువులు చెప్పటం, ప్రభుత్వాలు దానికి వంతపాడటమే విచిత్రం.

మాతృభాషలో సమాచారం అనేది మనిషిగా పుట్టినందుకు సహజంగా జరగవలసిన ఒక ప్రక్రియ. మనుషులే కాదు, జంతువులు కూడా తమ మాతృభాషలోనే సమాచారం ఇచ్చి పుచ్చుకుంటాయి. కొందరు మనుషులకే ఈ మాతృభాషా విరక్తి!

"మనం ఇంగ్లీషు భాషలో ఆలోచిస్తాం. ఇంగ్లీషులో మాట్లాడుతాం. అందువలన మన భాష వాడకం అవకాశాలు తగ్గిపోతాయి. మన మాటలు విని జనం అసహ్యంగా చూస్తున్నారని ఇంగ్లీషు వాచాలత్వం ఉన్నవారు గుర్తించట్లేదు. దేశ అవసరాలకు ఆంగ్ల భాషాపాండిత్యం తప్పనిసరి కానేకాదు (గాంధీజీ ఉపన్యాసాలు-పుట 110).

గాంధీజీ ఒక పాఠశాలకు వెళ్ళినప్పుడు అక్కడ పాఠాలు చెప్పే గురువులంతా తమను ఫలానా అంశం బోధించే గురువులుగా పరిచయం చేసుకున్నారు. అప్పుడు, సమగ్ర వ్యక్తిత్వాన్ని బోధించే విధానం ఈ విద్యావ్యవస్థలో లేదని, ఎవరూ దాని గురించి విద్యార్థులకు బోధించట్లేదని గాంధీజీ తన అసంతృప్తి వ్యక్తం చేశారు. "ఆత్మ విశ్వాసం, ఆత్మగౌరవాలను పెంచి, తన కాళ్లమీద తాను నిలబడేలాచేసే విద్యను విద్యార్థుల బుర్రకెక్కించాలి" అని సూచించారాయన.

"నాకే అధికారం ఉంటే ఈ పాఠ్యగ్రంథాలన్నింటినీ తిరిగి వ్రాయిస్తాను. మన సంస్కృతికి, మన నాగరికతకు, మన గృహజీవితానికి అనుగుణంగా ఉండే విషయాలను పాఠ్యగ్రంథాల్లో వ్రాయిస్తాను. మన దేశానికి ఈ రకపు విద్య పనికిరాదు. ఈ రకపు విద్య నేర్పటం నేరం కిందకే వస్తుంది".

"మన దేశంలో నూటికి ఎనభై వంతులు వ్యవసాయం, నూటికి పదివంతులు పరిశ్రమలు, ఈ పరిస్థితిలో పిల్లలకు మనది కాని సారస్వతాన్ని బోధించి జీవితంలో దేనికీ పనికిరానివారిగా తయారు చేస్తున్నారు. ఇలా చదువుకున్న వీరంతా శరీర కష్టానికి తాళలేనివారుగా మారిపోతారు. గుమాస్తాలుగానో, ద్విభాషీలుగానో మాత్రం పనికి వస్తారు".

"చిన్నపిల్లలుగా ఉన్నప్పటినుండే, కష్టించి పనిచేయటం గౌరవమనే భావాన్ని పిల్లల్లో కలిగించాలి. కష్టపడటం అగౌరవం అని అసహ్యించుకునే విద్యను నేర్పరాదు. బడిపిల్లలు పనిచేయటానికి అసహ్యించుకోవటం చూస్తే విచారం కలుగుతుంది. ఒక రైతుబిడ్డ బడికిపోయి విద్య నభ్యసించినంత మాత్రాన వ్యవసాయాన్ని మానుకోవటానికి నాకు కారణం కనిపించదు. తన జ్ఞానంతో వ్యవసాయాన్నే అభివృద్ధి చేసేవాడిగా ఎదగవలసిన విద్యావంతుడైన రైతుబిడ్డ గుమాస్తాగా జీవించాలనుకోవటం దురదృష్టకరం".

మాతృభాష పునరుద్ధరణ, మాతృభాషకు పునర్వైభవం అని గాంధీజీ అనగానే, ఆరోజుల్లోనే మాతృభాష కడుపుకు కూడు పెట్టదని పెదవి విరిచిన వారున్నారు. కడుపు కాలే వాళ్ళకు మాత్రమే తెలుస్తుందని, ఆదర్శాలు కడుపు నింపవనీ అన్నవాళ్లూ ఉన్నారు.

"ప్రాథమిక దశను దాటిన తర్వాత అతను ఏభాషలో తన విద్యను అభ్యసించినా నెగ్గుకు రాగలడు. అప్పుడు ఆ వ్యక్తి ఆంగ్లం అభ్యసించినా చాలా సులభంగా పైకి రాగలడు"అనేది మహాత్ముడు వారికిచ్చిన సమాధానం.

ఒక భాష దాన్ని మాట్లాడే ప్రజలకన్నా గొప్పదీకాదు, తక్కువదీకాదు. ఒక సమాజంలోని విజ్ఞానాభివృద్ధి ఆ సమాజంలోని భాషలో ప్రతిబింబించాలి. సమాజ అవసరాలను ఆ భాష సమర్థంగా నిర్వహించే విధంగా సాంకేతికతను మనకు అనుకూలంగా మలచుకోగలిగినప్పుడు, ఆ శాస్త్ర విజ్ఞానంలో సామాన్యుడి ప్రయోజనాలు ఇమిడి ఉన్నాయని అర్థం.

పాలనాపరంగా మాతృభాషలను వినియోగించిన కొద్దీ సామాన్యుడి ప్రయోజనాలు నెరవేరుతుంటాయి. మన రాజకీయ నాయకులు చక్కని మాతృభాషనే మాట్లాడతారు.

ఇప్పటికి ఇంగ్లీషులో ఓట్లు అడిగే నాయకులెవరూ లేరు. తెలుగు భాషను పూర్తిగా రద్దు చేశాక ఆ ముచ్చట కూడా తీరుతుందేమో చూద్దాం.

## ఇంగ్లీషులో చదువు

ఆంగ్లేయులు పోయినా ఆంగ్లం పాలిస్తోంది. తెలుగు మన అవసరాలకు చాలదనటం ఆడలేని సాని మద్దెల ఓడు అనటం లాంటిది. "భాష మాట్లాడేవాడు వివేకవంతుడైతే భాషకూడా వివేకంగా ఉంటుందంటారు గాంధీజీ.

"ఇంగ్లీషు విద్యను పూజించటం నాకు సరిపోదు. కానీ, ఇంగ్లీషుని నేను ద్వేషించను. ఆంగ్లపరిపాలనను నాశనం చేయాలనుకుంటాను. కానీ, ఆంగ్ల భాషను నాశనం చేయాలనుకోను. ఆంగ్ల వ్యామోహం లేకపోతే రామ్మోహనరాయ్ లాంటి వాళ్లు ఇంకా గొప్ప వాళ్లై ఉండేవాళ్లని నమ్ముతాను. ఆంగ్ల భాషని అభ్యసించినందువలనే శంకరాచార్యుడు, గురుగోవిందసింగ్ ఇంకా చాలామంది మహాత్ములు కాగలిగారా?(యంగ్ ఇండియా-13-04-1921" అని ప్రశ్నించారు గాంధీజీ.

"నాకు 12వ యేడు వచ్చే వరకూ నేను నేర్చుకున్న చదువంతా నా మాతృభాష అయిన గుజరాతీలోనే! అప్పటికి నాకు లెక్కలు, చరిత్ర, సాంఘిక శాస్త్రాలు కొంతవరకూ తెలుసు. తొలి మూడేళ్లూ మాతృభాషలోనే నేర్పించినప్పటికీ, సగానికన్నా ఎక్కువ సమయాన్ని ఇంగ్లీషు నేర్చుకోవటం, దాని నిరంకుశ వర్ణక్రమాలు, ఉచ్చారణలను కంఠస్థం చేయటానికే సరిపోయేది. గందరగోళం అంతా నాలుగవ సంవత్సరం నుండే మొదలయ్యేది. క్షేత్రగణితం, బీజగణితం, రసాయనశాస్త్రం, జ్యోతిశ్శాస్త్రం, చరిత్ర, భూగోళం అన్నీ ఆంగ్లంలోనే నేర్చుకోవలసి ఉండేది. ఆఖరికి సంస్కృతం, పర్షియను భాషల్ని కూడా ఇంగ్లీషులో నేర్చుకోవాల్సి వచ్చేది. ఎవరైనా పిల్లవాడు తన మాతృభాషలో మాట్లాడితే దండన విధించేవాళ్లు. తప్పుడు ఇంగ్లీషు మాట్లాడినా ఉపాధ్యాయులు ఏమనేవారు కాదు. ఏమైనా అనటానికి ఆ ఉపాధ్యాయుడికి ఎంత ఇంగ్లీషు వచ్చో తెలియదు. ఎందుకంటే ఇంగ్లీషు ఆయనకూ పరభాషే! మాతృభాషలో మాట్లాడితే మాత్రం దండించేవారు. దీనివలన గందరగోళంగా ఉండేది చదువు. అర్థం కాకపోయినా బట్టీయంపట్టి చదవాల్సి వచ్చేది.

"అపారమైన మాతృభాషాభిమానం ఉన్నప్పటికీ క్షేత్రగణితం, బీజగణితం, రసాయన శాస్త్రం జ్యోతిశ్శాస్త్రం వంటివాటి సాంకేతిక పదాలకు సరైన గుజరాతీ పదాలు నాకు ఇప్పటికీ తెలియవు. ఈ శాస్త్రాల్ని ఆంగ్లంలో కాకుండా గుజరాతీలో

నేర్పినట్లైతే తేలికగా ఒక్క సంవత్సరంలోనే నేర్చుకోగలిగి ఉండేవాడినని నాకిప్పుడు అర్థం అయ్యింది. విషయాన్ని ఇంతకన్నా ఎక్కువగా, తేలికగా గ్రహించగలిగి ఉండేవాడిని. అలాంటి జ్ఞానాన్ని నా నిత్యజీవితంలో ఉపయోగించుకోగలిగే వాణ్ణి కూడా!" అని స్పష్టంగా మహాత్ముడు వివరించినా మెకాలిజానికి లొంగిపోయినవారికి మనసు కరగలేదు. ఆంగ్లభాషలో నేర్చుకోవటానికి నాలుగేళ్లు పట్టే చదువు మాతృభాషలో ఒక యేడాది లోనే వస్తుందని స్వీయానుభవం లోంచి చెప్తున్నానన్నారు గాంధీజీ.

"ఇంగ్లీషు చదువులు నాకూ, ఇంగ్లీషు చదవని మా కుటుంబానికీ మధ్య పెద్ద అగాథాన్ని సృష్టించింది. నేను ఏం చదూతోందీ, ఏం చేస్తోంది మా నాన్నగారికి తెలీదు ఆయన అఖండ మేధావి, కానీ, ఒక్క ఆంగ్లపదం కూడా తెలీదు. దీనివలన నా ఇంట్లో నేను పరాయివాణ్ణయి పోతున్నాను. ఇది నాలాంటి అందరికీ అనుభవంలోని విషయమే"

"ఆంగ్లపద్యాలు వచనాలు నేర్చుకొని ఉండకపోతే నేను అపురూప అవకాశాలను కోల్పోయి ఉండేవాణ్ణని ఇప్పటికీ భావించట్లేదు. ఆ ఏడేళ్లూ నా మాతృభాషలో గణితం, సామాన్యశాస్త్రం, సాంఘికశాస్త్రం సంస్కృతం లాంటివి నేర్చుకుని ఉన్నట్టయితే, ఆ జ్ఞానంతో నేనింకా ఎక్కువగా ప్రజలతో మమేకమై ఉండేవాణ్ణని నమ్ముతున్నాను".

"శీతలశీతోష్ణస్థితి గల ఇంగ్లండుకు ఇంగ్లీషు ఉపకరించినట్టు భారతజాతికి ఉపకరించదు. మనమూ మన పిల్లలూ పరంపరాగతమైన పద్ధతులలోనే పురోగమిస్తేనే ప్రగతి! పరులను ఆశ్రయిస్తే మనది పతనమై పోతుంది"

"ప్రపంచంలోని ఉదాత్త విషయాలను పరిగ్రహించి, ప్రాంతీయభాషలలో తర్జుమాలను అందజేసే నిమిత్తం ప్రత్యేకంగా కొంతమంది చదువుకున్న వారిని ఏర్పాటు చేయటం సమంజసంగా ఉంటుంది. మనకు వక్రమార్గం చూపించి, మన పెద్దలే మనకు అక్రమంగా కనిపించేలా చేశారీ ఇంగ్లీషువాదులు".

"మన దేశంలో పట్టభద్రులు స్వంత ఇంటిలోనే పరాయివారు. ఆంగ్లపదాలు లేనీదే ఎవరూ మాట్లాడలేనంతగా వారి మాతృభాషా పరిజ్ఞానం పరిమితమై పోయింది. ఆంగ్లగ్రంథాలు లేనిదే వారి మనుగడ లేదేమో!"

"ఆంగ్లభాష తెలియకపోతే ఎవరూ జగదీశ్ చంద్రబోసు లాంటి ప్రముఖులుగా తయారు కాలేరనే వాదనని కూడా నేను అంగీకరించలేను. అదీ మూఢవిశ్వాసమే! ఆయన విజ్ఞానం చాలావరకూ సామాన్య ప్రజలకు అందుబాటులో లేనిది. మనలాగా జపానీయులు ఎవరూ ఇంగ్లీషు లేకపోతే మేము లేమనే అసహాయతను వ్యక్తపరచరు".

ప్రాధమిక విద్య మాతృభాషలో జరగాలనే తాను కోరుతున్నాననీ, మాతృభాషలో వేసిన గట్టి పునాదుల మీద పై చదువులకు వెళ్ళే కొద్దీ విద్యార్థి ఆంగ్లం సహా అనే భాషలను, శాస్త్రాలను నేర్వగలిగే సమర్థత అలవరచుకో గలుగుతాడనీ, మాతృభాషలో ఎక్కువ చదువు అబ్బుతుందనీ గాంధీ చెప్పేవారు.

## ఇంగ్లీషు వలన నష్టాలే ఎక్కువ

వివిధ సందర్భాల్లో గాంధీజీ పరాయి విద్యని బలవంతంగా విద్యార్థుల నెత్తిన రుద్దాలనే ప్రయత్నాన్ని నిరశిస్తూ ఇది అసహజ విద్యావిధానంగా పేర్కొన్నారు.

"ఆంగ్లం మన హృదయాలలో అన్యాయంగా అత్యున్నత స్థానం ఆక్రమించుకుని మన మాతృభాషలను దెబ్బతీసింది. అది ఆంగ్లేయులతో మన అసంబద్ధ సంబంధాలకారణంగా ఏర్పడిన అసహజ స్థానం. ఆంగ్లభాష అవసరం లేకుండానే సముదాత్త భారతీయ మానసికాభివృద్ధి సాధ్యపడాలి".

"ఆంగ్లభాష రానిదే ఉత్తమ సమాజంలో ప్రవేశార్హత దుస్సాధ్యమని భావించేటట్లు మన బాలబాలికలను ప్రోత్స హించటం మానవజాతిని-ముఖ్యంగా భారతీయ మహిళా లోకాన్ని హింసించటమే! అది దుర్భరమూ, దుస్సహమూ అయిన విషయం. ఆంగ్లభాషా వ్యామోహం నుండి విముక్తి చెందటం స్వరాజ్య అవసరాలలో ఒకటి. ఆంగ్లవిద్య బోధన విధానంలో చదివిన భారతీయుణ్ణి నిర్వీర్యపరచి భారతీయ విద్యార్థి నరాల పటుత్వానికి తీవ్రమైన ప్రయాస కలిగించి, మనలను నాయకుల్ని కాకుండా అనుచరుల్ని చేసిందని నా దృఢవిశ్వాసం".

"దేశభాషలను తొలగించిన తీరు ఇంగ్లీషువారితో మన సంబంధాల అధ్యాయంలో ఒక విషాదకర ఘట్టం"

"ఆంగ్లంలో ఆలోచించి, ప్రధానంగా ఆంగ్లంలోనే భావాలు ప్రకటించవలసిన అవరోధంతో ప్రారంభించి ఉండకపోతే రామమోహన రాయ్ మరింత గొప్ప సంస్కర్త, తిలక్ ఒక మహాపండితుడు అయి ఉండేవారు. ఈ అసహజ విధానంలో వారు కొంత తక్కువగా పెరిగి ఉన్నట్టయితే స్వీయప్రజలపై వారి ప్రభావం మరింత అధిక మయ్యేది. ఆంగ్ల సారస్వతకోశంలో వారికి గల జ్ఞానాన్నిబట్టి వారు ఎంతో గ్రహించారనడంలో సందేహం లేదు. కానీ, ఇవి వారి మాతృభాషలో అందుబాటులోకి తేవలసింది" (యం. ఇం. 27-04-1921)

1823లో రాజారామ్మోహన రాయ్ గవర్నర్ జెనరల్ విలియం పిట్ట్‌కి దేశంలో ఇంగ్లీషు మీడియం పెట్టాలనీ, సంస్కృత తరహా విద్యావిధానం దేశాన్ని

అంధకారంలోకి నెట్టి వేసిందనీ ఉత్తరం వ్రాసి ఇచ్చాడు. జగదీశ్ చంద్రబోస్ మొక్కలకు ప్రాణం ఉందని సంస్కృత పండితులు కనుగొనలేక పోయారని ప్రకటించాడు. ప్రాణుల్ని స్థావర (వృక్షజాలాలు) జంగమ (జంతుజాలాలు) అని రెండుగా భారతీయ శాస్త్ర విజ్ఞానం విభజించిన సంగతి బోసుగారు విస్మరించటం గాంధీ మహాత్ముని బాధించింది.

"ఇంగ్లీషుకి ఈ రోజున వాణిజ్యపరమైన రాజకీయ పరమైన ప్రయోజనాలున్నాయి. ఉద్యోగావకాశాల కోసం, ఆడపిల్లలకు పెళ్ళికి పాస్'పోర్ట్ లాగా ఉపయోగపడేందు కోసమూ ఇంగ్లీషు చదువులు ఉపయోగ పడ్తున్నాయి. ఇంగ్లీషుని తమ మాతృ బాషగా భావించుకునే చాలా కుటుంబాలను నేనెరుగుదును. ఇంగ్లీషు రాకపోతే దేశానికి స్వాతంత్ర్యం అసంభవం అని చాలా మంది కుర్రాళ్ళు అనుకుంటున్నారు. ఇదొక రాచపుండులా సమాజంలో వ్యాపిస్తోంది. చాలా మంది దృష్టిలో చదువు అంటే ఇంగ్లీషే! నా దృష్టిలో మాత్రం ఇవన్నీ బానిస లక్షణాలు. మనల్ని మనం దిగజార్చుకోవటమే. తల్లిదండ్రులు తమ పిల్లలకు, భర్తలు తమ భార్యలకు ఇంగ్లీషులో ఉత్తరాలు రాసుకోవటం కన్నా దుర్భరం ఇంకొకటి లేదు" అన్నారు గాంధీజీ. (The Selected Works of Gandhi"Vol. 6 The Voice of Truth).

ఇంగ్లీషు వ్యామోహ పరుల్ని నిరశిస్తూ "విదేశీ పాలకులు చేస్తున్న అనేక పాపాలతో పాటు, ఇంగ్లీషుని రుద్దటం అనేది చరిత్రలో ఒక మహాపాపంగా నిలిచి పోతుంది..." అని శపించారు గాంధీజీ!

"ఆంగ్లమాధ్యమంలో చదువు ఈ దేశపు విలువైన శక్తిని పీల్చేస్తోంది. అది మనుషుల్ని విడదీస్తోంది. విద్యని అత్యంత ఖరీదైనదిగా మారుస్తోంది. విద్యావంతులు ఈ ఇంగ్లీషు మాయలో పడవద్దు" (be free from the hypnotic spell of the foreign medium) అని గాంధీ కోరారు.

ఏప్రియల్ 1921న మహాత్మా గాంధి ఇంగ్లీషుకి వ్యతిరేకంగా ఒక ఉద్యమం ప్రారంభించారు. "ఇంగ్లీషులో భారతీయుల చదువు శుద్ధతప్పు('unmitigated evil)" అన్నారు.

"ఇంగ్లీషు చదువుకున్న మనవాళ్లంతా కలిసి చేసింది శంకరాచార్యుడు ఒక్కడే చేసిన దాని కన్నా తక్కువే" అని వ్యాఖ్యానించారాయనా. గాంధీ ఇంగ్లీషు వ్యతిరేకతను విశ్వకవి రవీంద్రనాథ్ టాగూరు తీవ్రంగా విమర్శించటంతో దేశంలో పెద్ద ఎత్తున ఇంగ్లీషు వ్యతిరేక, అనుకూల చర్చలు సాగాయి. భారతీయత గురించి మాట్లాడటాన్ని, సహాయ నిరాకరణోద్యమాల వంటి గాంధీ ఉద్యమాలని ఒక విధమైన మతతత్త్వం (xenophobia)గా విమర్శలొచ్చాయి. దానికి ఘాటుగానే ప్రతిస్పందించారు గాంధీ:

"స్వేచ్ఛావాయువుల మీద విశ్వకవికి ఉన్నంత నమ్మకం నాకూ ఉంది, కానీ, నేను నా ఇంటిని చుట్టూ గోడకట్టి మూసేసి, కిటికీలు మాత్రం తెరిచి ఉంచి స్వేచ్ఛా వాయువులను పీలుస్తున్నానని భావించలేను..." అని! ఆ రోజుల్లో గాంధీ చేసిన కిటికీల వ్యాఖ్య మేథావి వర్గంలో పెద్ద చర్చకు దారి తీసింది.

భాషాభిమానులైన సాహితీ సాంస్కృతిక వేత్తల్ని ఆ రోజుల్లో linguidextrous intellectuals అని పిలిచే వాళ్ళు. 'లింగ్విడెక్స్'ట్రస్ మేథావులు చేసిన కృషీ, పోరాటాలే కొంత వరకైనా మాతృభాషల పరిరక్షణకు తోడ్పడ్డాయి.

## మాతృభాషలో రూపొందే మనసు

"మాతృదేవినుండే తొలిపాఠం శిశువు స్వీకరిస్తుంది. అందువలన మానసిక పరిణతికి ఆమె బిడ్డలపై అన్యభాషను విధించటం మాతృభూమికి ద్రోహం చేయటమేనని నేను భావిస్తున్నాను"('బోధనాభాష' గ్రంథానికి గాంధీజీ తొలిపలుకులు).

"విద్యార్థి ఒక పాఠ్యాంశంలో వెనకబడి ఉండటం అంటే, అది ఆ పాఠ్యాంశానికే పరిమితమైన విషయం. కానీ, ఒక మాతృభాషలో వెనకబడి ఉండటం అంటే, ఆలోచనాశక్తీ, వ్యక్తీకరణమూ, అనే రెండు మౌలికమైన మేథోవ్యవస్థలు ఆ విద్యార్థి విషయంలో కుప్పకూలి పోయాయని అర్థం" అంటారు గాంధీజీ.

మనిషి మనసు మాతృభాషలోనే లోతైన ఆలోచనలు చేస్తుందని మానసశాస్త్రం చెప్తోంది. తరగతి గదిలో బోధిస్తున్న విషయాన్ని విద్యార్థి మాతృభాషలోనే అర్థం చేసుకుంటాడు. ఆకళింపు చేసుకుంటాడు. అమ్మభాష రాకపోతే, పాఠ్యాంశాలు అర్థం కాకుండా పోతాయి. చదువులోనూ, తెలివితేటల్లోనూ బిడ్డ వెనకబడిపోతాడు. ఇతర భాషల పరిజ్ఞానంతో పాటు అమ్మభాష కూడా విద్యార్థులకు తెలియాలి. ఇది పిల్లల మేథోసంపన్నతను తక్కువ చేస్తుందేగాని పెంచదు. తెలుగు తెలియకుండా ఆంగ్లంలో పెంచాలనుకునే తలిదండ్రులు తమ పిల్లల్ని అర్ధమేథావులుగా తయారు చేయాలనుకుంటున్నారు.

పుట్టిన కొన్ని గంటల లోపే చంటి బిడ్డ అమ్మభాషకూ, పరభాషకూ ధ్వనిలో తేడా గుర్తించగలడని శాస్త్రవేత్తలు ప్రకటిస్తున్నారు. గంటల బిడ్డకు ఈ ధ్వనుల పరిజ్ఞానం ఎక్కడిది? అమ్మకడుపులో ఉన్నప్పుడే 'అమ్మధ్వని'ని గ్రహించ గలగటమే ఇందుకు కారణం అని తాజా పరిశోధనలు చెప్తున్నాయి. పుట్టటానికి ఇంకా నాలుగైదు నెలల ముందునుండే, అమ్మ కడుపులోనే బిడ్డలు తొలుతగా ఆకళింపు చేసుకునేది అమ్మభాషనే! పుట్టగానే బిడ్డ అమ్మగొంతునీ, అమ్మమాటనీ గుర్తుపట్ట గలుగుతాడు.

పదాలూ పదబంధాలూ లేకపోయినా అప్పుడే పుట్టిన బిడ్డ ఏడుపులో అనేక భావాలూ, అర్థాలూ మాతృభాష లోనే ఉంటాయి. అది ధ్వని ఆకళింపు మాత్రమే! కడుపులో ఉండగానే అఆఇఈ వచ్చేస్తాయని కాదు.

అమ్మకడుపులో ఉన్న కాలంలోనే నాడీవ్యవస్థ, జ్ఞానేంద్రియ వ్యవస్థలు ప్రారంభమౌతాయి. శబ్దాలతోపాటు, రుచులూ, వాసనల్ని కూడా బిడ్డ ఆస్వాదించ గలుగుతాడు. పుట్టిన తరువాత ఆ ఆస్వాదన కొనసాగుతుందని పరిశోధకులు చెప్తున్నారు. ఏడవనెలలోనే బిడ్డ నాలుకమీద రుచిని తెలియచేసే కేంద్రాలు (Taste buds) ఏర్పడతాయి. గర్భవతిగా ఉన్నప్పుడు తల్లి తిన్న భోజన పదార్థాల సుగంధాన్ని కూడా బిడ్డ గ్రహిస్తాడని, దాన్ని బాగా గుర్తు పెట్టుకుంటాడని ఈ పరిశోధనలు చెప్తున్నాయి. పుట్టిన తరువాత ఆ బిడ్డకు ఏవేవి తినిపిస్తామో వాటిని రుచికరంగానూ, ఇష్టంగానూ గర్భవతిగా ఉన్న సమయంలో తల్లి తినడం వలన బిడ్డకు వాటిపైన ఇష్టత పెరుగుతుందని కూడా గుర్తించారు.

"నిఃశ్వాసోచ్ఛ్వాస సంక్షోభస్వప్నాశాన్ గర్భోఽధిగచ్ఛతి/మాతుర్నిశ్వసితోచ్ఛ్వాస సంక్షోభ స్వప్న సంభవాన్" అనే సుశ్రుతాచార్యుల సిద్ధాంతం ఇదే చెప్తోంది. తల్లి గర్భంలో పెరుగుతున్న శిశువు పైన తల్లి ఉచ్ఛ్వాస, నిఃశ్వాసాలు, తల్లి మనో భావాలు ప్రభావం చూపుతాయి. అలాగే, బిడ్డ మనోభావాలు కూడా తల్లి పైన ప్రసరించటం వలనే గర్భవతులకు వేవిళ్ళు కలుగుతాయని ఈ సిద్ధాంతం చెప్తోంది.

నాలుగవ నెల వచ్చేసరికే గర్భస్థ శిశువులో హృదయమూ, మనోవృత్తులు ఏర్పడతాయి. తనదొకటీ, తన కడుపులో బిడ్డదొకటీ రెండు హృదయాలు కలిగినది కాబట్టి, 4వనెల గర్భవతిని "దౌహృదిని" అంటారు. హృదయమూ, మనోవృత్తులూ, సుఖదుఃఖ భావనలన్నీ బిడ్డకు కలగటంలో మాతృభాషదే ముఖ్యపాత్ర!

మన శబ్దాలు, మావిపొరల మధ్య ఉమ్మనీటిలో పెరుగుతున్నశిశువులకు యథాతథంగా వినిపించవు. నీటిలో చేపలు వాటి శరీరాంగాలనుంచి, ఎముకలనుంచీ మెదడుకు చేరిన ధ్వని తరంగాలను గ్రహించినట్టు, బిడ్డ ఉమ్మనీటిలోంచి తల్లిభాషను స్వీకరించటం ప్రారంభిస్తాడని లీప్ జీగ్ కు చెందిన Max Planck Institute for Human Cognitive and Brain Sciences ప్రొఫెసర్ Angela D. Friederici వెల్లడించారు. గర్భస్థ శిశువులు గాఢ నిద్రావస్థలో ఉన్నప్పుడు కూడా వాళ్ళ మెదళ్ళు ధ్వని తరంగాలను స్వీకరించ గలుగుతాయంటున్నారు.

వాషింగ్టన్ విశ్వవిద్యాలయం ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ లెర్నింగ్ & బ్రెన్ సైన్సెస్ కు చెందిన Patricia Kuhl అనే పరిశోధకుడు చెప్పిన విషయాలు ఆశ్చర్యకరంగా

ఉన్నాయి. చివరి 10 వారాల కాలంలో గర్భస్థ శిశువు అమ్మభాష లోని అచ్చుల్ని ఎక్కువగా గ్రహించ గల్గుతాడనేది ఆయన పరిశోధనలోని సారాంశం.

భాషకు అచ్చులు మూలం. పసిపిల్లల భాషంతా అచ్చులు ప్రధానంగా నడుస్తాయి. పుట్టి, ఎదిగే కొద్దీ అచ్చులతో హల్లుల్ని ముడిపెట్టడం ఎలాగో నెమ్మదిగా గ్రహిస్తాడు. 30 గంటల వయసున్న పసిబిడ్డలు వాళ్ల అమ్మభాషలోని అచ్చుల్ని ఎలా ఆకళింపు చేసుకుంటున్నారో కంప్యూటర్ల సాయంతో విశ్లేషించి ఈ నిర్ధారణకొచ్చారు.

'సైకో లింగ్విస్టిక్స్' అనే శాస్త్ర విభాగానికి చెందిన పరిశోధనాంశం ఇది. పదాలను పలకటం లోని ఉచ్చ, మధ్య, మంద్ర స్థాయిల ఆకళింపు ఇందులో మొదటి అంకం.

2009 నవంబర్ 5న కరెంట్ బయాలజీ అనే వైద్యపత్రికలో ఈ "సైకోలింగ్విస్టిక్స్" అంశం పైన తొలి పరిశోధన వెలువడింది. జెర్మనీలోని ఉర్జ్‌'బర్గ్ విశ్వవిద్యాలయానికి చెందిన శ్రీమతి Kathleen Wermke అనే శాస్త్రవేత్త Human fetuses are able to memorise sounds from the external world by the last trimester of pregnancy, with a particular sensitivity to melody contour in both music and language అని పేర్కొన్నారు. బిడ్డ పుట్టడానికి చివరి మూడు లేక నాలుగు నెలలు భాషకు సంబంధించి కీలకమైన కాలం. ఆ సమయంలో బయటి ధ్వనుల్ని గర్భస్థశిశువు గ్రహించే ప్రయత్నం చేస్తాడు. ఈ ధ్వనుల్లో అమ్మ మనోభావాలతో కూడిన భాష బిడ్డకు ఎక్కువ ఆకళింపు అవుతుంది. తల్లిభాషా పదాలలోని లయ కొంత ఆకళింపు కొస్తుంది. ప్రసవించాక వీలైనంత త్వరగా తల్లులు బిడ్డతో మాట్లాడటం మొదలు పెడితే, బిడ్డకు సౌకర్యవంతంగా ఉంటుంది. Perceptual preference అంటారు దీన్ని.

తల్లి గర్భంలో ఉండగా తాను నేర్చిన ఆ స్వల్ప మాత్రపు భాషలోనే కొత్త పాపాయి మాట్లాడుతుంది. ఎలా మాట్లాడుతుంది? తన ధ్వనులతో మాట్లాడుతుంది. బిడ్డ పుట్టి, ఎదుగుతున్న క్రమంలో మనం ధ్వనుల్ని నేర్పిస్తాం. భాషించటం నేర్పిస్తాం. కానీ, ఇంకా పుట్టకుండానే, అమ్మ కడుపులోనే ఈ నేర్చుకోవటాలన్నీ స్వయంగా మొదలు పెడుతుతున్నాడు బిడ్డ. దీన్ని "pre-adaptation for learning language (పుట్టకమునుపే భాష నేర్చుకునే ప్రయత్నం)" అంటారు.

మాతృభాష ప్రభావంతో బిడ్డ మనసు రూపొంది, మాతృభాషలోనే అది పరిణతి పొందుతుంది. మాతృభాషకు అతీతంగా బిడ్డను పెంచాలని చూస్తే అది ఆ బిడ్డలో మానసిక దౌర్బల్యాన్ని కలిగిస్తుందని కూడా శాస్త్రవేత్తలు నిర్ధారించారు.

అమ్మకడుపులో నేర్చిన భాషలోనే బడిలోకి వచ్చాక నేర్చుకుంటున్న భాషని అనువదించి అర్థం చేసుకొనే ప్రయత్నం చేస్తారు పిల్లలు. ప్రాథమిక విద్యలో

అమ్మభాషని నిషేధిస్తే, భాషాపరమైన అవ్యవస్థ (language disorder) ఏర్పడుతుందని ఈ పరిశోధనకు నాయకత్వం వహించిన శ్రీమతి కథ్లీన్ వెర్క్ అన్నారు.

ఈ పరిశోధనలకోసం ఆమె అప్పుడే పుట్టిన 60 మంది సద్యోజాత శిశువుల తొలిరోదనని రికార్డ్ చేశారు. అప్పుడే పుట్టిన బిడ్డల మొదటి ఏడుపు (first cry) మీద జరిగిన తొలిపరిశోధన ఇది. ఈ 60మంది పిల్లల్లో 30 మంది ఫ్రెంచి తల్లులకు, 30 మంది జెర్మన్ తల్లులకూ పుట్టినవాళ్ళు. మొదటి ఐదు రోజులపాటు ఆ బిడ్డల రోదన ధ్వనుల్ని విశ్లేషించి, ఫ్రెంచి తల్లులకు పుట్టిన బిడ్డల ఏడుపు తక్కువ స్థాయి నుండి ఎక్కువ స్థాయిలోకి ఆరోహణ క్రమంలోనూ, జెర్మనీ తల్లులకు పుట్టిన బిడ్డల ఏడుపు హెచ్చు స్థాయి నుండీ కిందకు అవరోహణ క్రమంలోనూ ఉన్నట్టుగా గమనించారు.

సాధారణంగా ఎక్కువ జెర్మన్ పదాలు పై స్థాయి నుంచి కింది స్థాయికి వస్తాయని, ఎక్కువ ఫ్రెంచి పదాలు కిందిస్థాయి నుంచి పై స్థాయికి వెడతాయనీ విశ్లేషకుల భావన. ఉదాహరణకు, ఫ్రెంచి భాషలో తండ్రిని "papaa" అని ఆరోహణంలో పలికితే, జెర్మన్ భాషలో "paapa" అని అవరోహణంలో పలుకుతారట. పాప ఏడ్చినప్పుడు మధ్యలో గాలి పీల్చుకోవటానికి ఇచ్చే కొన్ని క్షణాల విరామానికి ముందు ఏడుపు హెచ్చుస్థాయిలో ఉన్నదా లేక తక్కువ స్థాయిలో ఉన్నదా అని పరిశీలించారు. ఆకలి, అసౌకర్యం, నొప్పి, వంటరి తనం ఇలాంటి కారణాలతో పసికూనలు చేసే రోదనలను వర్గీకరించుకుని విశ్లేషించారు. జెర్మన్ బిడ్డల ఏడుపు హెచ్చుస్థాయి నుంచి తగ్గుస్థాయికి అవరోహణ క్రమంలో ఉండగా, ఫ్రెంచి బిడ్డల రోదనం దిగువస్థాయి నుంచి పై స్థాయికి ఆరోహణ క్రమంలో ఉన్నట్టు తేలింది.

ఫ్రెంచి తల్లికి పుట్టిన బిడ్డ ఫ్రెంచి భాషలోనూ, జెర్మనీ తల్లికి పుట్టిన బిడ్డ జెర్మన్ భాషలోనే ఏడుస్తారనేది ఈ తాజా పరిశోధనా సారాంశం. దీన్నిబట్టి, మాతృభాషలోనే మనోభావాలను వెల్లడించే ప్రయత్నం (ability to actively produce language) అనేది పుట్టిన క్షణంనుంచే మొదలౌతుందన్నమాట. .

తల్లిభాషలో ఉండే యాసను, ధ్వని విధానాన్నీ (rhythm and intonation) గర్భంలోనే బిడ్డలు పసిగడతారనీ, పుడుతూనే వాటిని అనుకరిస్తూ తమ ధ్వనులలో మనోభావాలు వ్యక్త పరుస్తారనీ శాస్త్రవేత్తలు చెప్తున్నారు. ఇక్కడ "యాస" అంటే, "భాషలోని లయ (rhythm)" అని! తమిళం, తెలుగు, సంస్కృతం మొదలైన భాషలలో లయపరంగా తేడాలు ఉన్నట్టే, జెర్మనీ, ఫ్రెంచి భాషల లయల్లోనూ తేడాలున్నాయి. బిడ్డల మొదటి ఏడుపు కూడా అందుకు అనుగుణంగానే ఉంటుంది.

నోరు లేని జంతువులు కూడా తమ మనోభావాలను ధ్వనుల ద్వారానూ, సైగల ద్వారానూ వ్యక్తపరుస్తాయి. భాష రాకుండా భావ వ్యక్తీకరణ ఏర్పడదనే వాదన సరికాదు. భావ వ్యక్తీకరణను బిడ్డ, అమ్మ కడుపులోనే సాధన చేస్తున్నాడు. అందుకు అమ్మభాష దోహదపడుతోంది. పుట్టాక కూడా అమ్మభాషలోనే బిడ్డ పెరగాలి. ప్రాథమిక విద్యలో నేర్చే అంశాలను అమ్మభాషలో ఆకళింపు చేసుకోవటానికి, తద్వారా ఎక్కువ సమాచారాన్ని గ్రహించటానికి ఆ బిడ్డకు వీలు కుదురుతుంది.

అమ్మభాషని అమ్మపాలతో పోల్చి గాంధీజీ ఇలా అంటారు: "నా మాతృభాషలో ఎన్ని లోపాలున్నా, తల్లి రొమ్ముకు శిశువువలె నేను దానికి హత్తుకుని ఉంటాను. అది మాత్రమే నాకు జీవదుగ్ధం ఇవ్వగలిగినది. దాని హద్దులో అది ఉన్నంతవరకూ నాకు ఆంగ్లభాష అంటే ప్రేమలేకపోలేదు. కానీ, అది దానికి చెందని స్థానాన్ని ఆక్రమిస్తే నేను దాన్ని తప్పనిసరిగా ఎదుర్కొంటాను" అని ప్రకటించారాయన. "ఆంగ్లానికి తలుపులు తెరిచి దారి ఒసగిన తరువాత భారతదేశానికి అవమానకరమైన పరిణతి కలిగించడానికి హేతుభూతం కాగలదు". (యం. ఇం. 4-07-1929) అని హెచ్చరించారాయన.

## నెరవేరని కల-అమ్మభాషలో పాలన

న్యాయస్థానాలలోనూ సాధారణ పాలనలోనూ మాతృభాషల్ని ప్రవేశపెట్టాలనేది గాంధీజీ పిలుపు. "రాష్ట్ర ప్రభుత్వాలకు న్యాయస్థానాలపై అధికారం పలుకుబడి వుంటే ప్రభుత్వకార్యాలయాలలోనూ, న్యాయస్థానాలలోనూ తక్షణమే రాష్ట్రభాషలను ప్రవేశపెట్టాలి, దీనిపైనే విజయం నిస్సందేహంగా ఆధారపడి ఉంది. సంస్కరణావశ్యకత మీద మనకు విశ్వాసం ఉన్నట్టయితే దానిని సాధించటం మనకు ఎంతోకాలం పట్టదు" (హరిజన్-30-07-1938).

"కోర్టుభాషగా ప్రాంతీయభాషలు ఉండటం బ్రిటిష్ ప్రభుత్వం మీద మనం సాధించే తొలి విజయం" (5-7-1928 .ఇం.)

"గత 50 యేళ్లుగా దేశీయభాషల ద్వారా మనం అభ్యసిస్తూన్నట్టయితే నేడు మనం ఉన్నత స్థితిలో ఉండేవాళ్లం"

"మాతృభాష తెలీకుండా చదివి పెరిగినందువలన భారతీయులు నూతన ఆవిష్కరణలు చేయలేకపోతున్నారు. ఆచార్య రే, ఆచార్య జగదీసు చంద్రబోసులనూ, వారి మహత్తర పరిశోధనలనూ తిలకించండి. వారి పరిశోధనలు సామాన్యమానవుడి సొత్తు కాకపోవటం సిగ్గు చేటుకాదా?" అని ప్రశ్నించారు గాంధీజీ! శాస్త్ర సాంకేతిక

రంగాలు సామాన్యమానవుడి భాషలోకి మళ్లాలని ఆయన వాదించారు (గాంధీ ప్రసంగాలు-31-08-1920).

"రాష్ట్రాలలో మాతృభాషని నేర్పించే పరిస్థితులు లేకపోతే భాష పేరుతో విశ్వవిద్యాలయం ఏర్పడినా పునాది సరిగా లేని భవంతిలా కూలిపోతుంది..." అని గాంధీజీ వ్యాఖ్యానించారు (భాష పేరుతో విశ్వవిద్యాలయాలు" 2-12-1941న హరిజన్ పత్రిక)

అయ్యదేవర కాళేశ్వర రావుగారు తన "నాజీవితము-నవ్యాంధ్రము"( 1959)లో ఉమ్మడి ఆంధ్రప్రదేశ్ ఏర్పడిన తరువాత పరిస్థితి గురించి వ్రాసిన అంశాలు ఇక్కడ గుర్తు చేసుకోవాలి.

"ఏ స్ఫూర్తితో ఆనాడు ఆంధ్రోద్యమం నడిచిందో, ఏ స్ఫూర్తితో ఆంధ్రవిశ్వవిద్యాలయం కావాలని గట్టిగా కోరుకున్నారో ఆ స్ఫూర్తి సగానికి తెగిపోయింది. ఇంతవరకును ఆంధ్ర విశ్వవిద్యాలయంలో ఉన్నత విద్యను ఆంధ్రభాషలోనే గరుపుటకెట్టి ప్రయత్నం జరుగలేదు. 1937లో రాజగోపాలాచారి ప్రభుత్వం స్థాపితమైనప్పుడు ధైర్యముగా ఆరవఫారము వరకూ హైస్కూళ్లలో యావత్తు విద్యా దేశభాషలలోనే ఏర్పాటు చేసిరి. అప్పటి నుండీ ఆంధ్ర జిల్లాలల్లో తెలుగులోనూ, అరవ జిల్లాల్లో అరవములోనూ స్కూలుఫైనల్, మెట్రిక్యులేషన్ వరకు యావత్తు విద్య నేర్పబడుచు, ఇంగ్లీషును రెండవ భాషగా నేర్పుచున్నారు. ఉస్మానియా విశ్వవిద్యాలయములో నైజాము పాలనాకాలంలో యావత్తు విద్య ఉరుదూ భాషలోనే నేర్పబడుచూ వచ్చినవి. ఇంగ్లీషు రెండవభాషగా మాత్రముండెను. నైజాము రాష్ట్ర మంతరించగనే ఉస్మానియా విశ్వవిద్యాలయములో కూడా ఉరుదూ బదులుగా ఇంగ్లీషునే పెట్టినారు. తక్కిన అన్ని విశ్వవిద్యాలయములలో కూడా తెలుగు ఉరుదూలు ఐచ్ఛిక స్థానము పొందినవి" అని అయ్యదేవర కాళేశ్వరరావుగారు వాపోయారు. తెలుగులోనే పాలించటం కోసం, తెలుగులోనే చదువుకోసం అమరజీవి పొట్టి శ్రీరాములుగారి ఆత్మార్పణంతో సిద్ధించిన తొలి భాషాప్రయుక్త రాష్ట్రం ఆంధ్రప్రదేశ్ ఏర్పడిన మొదటి మూడేళ్లలోనే పాలకులు తెలుగు భాషకు ఎలా తూట్లు పొడిచారో 1959నాటి కాళేశ్వరరావుగారి వాక్యాలు తేటతెల్లం చేస్తున్నాయి.

భాషా సంస్కృతులను కాపాడుకోవటం కోసం ప్రత్యేక రాష్ట్రం అనే లక్ష్యంతో సాగిన ఆంధ్రోద్యమాన్ని కేవలం ప్రత్యేక రాష్ట్రోద్యమంగా చిత్రించి భాషాసంస్కృతులను విస్మరించిన దాని చెడ్డఫలితం ఇది!

మాతృభాషకోసం అమరులైన భాషాసేవకులను కన్న బంగారుభూమి బంగ్లాదేశ్! భాషాప్రపంచానికి ఆదర్శప్రాయమైన దేశం అది!! ఉర్దూ భాషని పాకిస్తాన్ జాతీయ

భాషగా ప్రకటించినప్పుడు, బెంగాలీ మాతృభాషగా కలిగిన తూర్పు పాకిస్తానీయులు (ఈనాటి బంగ్లాదేశ్) అందుకు వ్యతిరేకంగా ఉద్యమించటంతో మాతృభాష కోసం అక్కడ అనేక పోరాటాలు జరిగాయి. 1952 ఫిబ్రవరి, 21న ఢాకాలో ఉద్యమకారులపైన జరిగిన కాల్పులలో నలుగురు ఢాకా విశ్వవిద్యాలయ మహమ్మదీయ విద్యార్థులు ప్రాణాలు కోల్పోయారు.

ఈ సంఘటన అంతర్జాతీయ సమాజాన్ని కలచి వేసింది. ఒక భాషీయుల మీద వేరొక భాషను బలవంతంగా రుద్దటం హేయమైన చర్యగా ఎందరో నిరసించారు. 1956లో పాకిస్తాన్ ప్రభుత్వం అంతర్జాతీయ వత్తిడికి తలొగ్గి అధికార భాషగా బెంగాలీని గుర్తించింది.

1999 నవంబర్, 17న యునెస్కో సంస్థ అమరులైన బంగ్లాదేశ్ భాషోద్యమకారుల సంస్మరణగా ఫిబ్రవరి 21ని అంతర్జాతీయ మాతృభాషా దినోత్సవంగా ప్రకటించింది. బంగ్లాప్రజలు ఈ రోజుని "భాషోద్యమ అమరుల సంస్మరణ దినంగా, వంగభాషామహోత్సవంగా జరుపుకొంటున్నారు. అలాగే, Aotearoa (we all belong) పదాన్ని న్యూజిల్యాండ్ 30 ప్రపంచ భాషల్లోకి అనువదింపచేసి ప్రచారం చేసింది. ఆష్ఫీల్డ్ పార్క్ సిడ్నీలో "అంతర్జాతీయ మాతృభాషా స్తూపం" నిర్మించింది.

కానీ, తెలుగుభాష కోసం అసువులు బాసిన పొట్టి శ్రీరాములుగారి ఆత్మబలిదానం వృథాగా పోయినా ఎవ్వరికీ పట్టలేదు. తెలుగుభాషకు ఇది శాపం. ఐతరేయబ్రాహ్మణంలో ఆంధ్రులు శాపగ్రస్థులని విశ్వామిత్ర శాపం గురించి చెప్తారు. ఆంధ్రులు శాపగ్రస్థులంటే ఇదే!

## సామాన్యుడికోసం భాష

18-1-1795న జె ర్యాంఘామ్ మచిలీపట్నం జిల్లా కలెక్టరుగా వచ్చాడు. ఆయన వస్తూనే ప్రజలు తమ కష్టసుఖాలు చెప్పుకో వటానికి భాష ఒక అవరోధంగా ఉండటాన్ని గుర్తించాడు. "ప్రజలు తప్పనిసరిగా తమ ఫిర్యాదులను కేవలం తెలుగు లోనే వ్రాయాలి. ఇంగ్లీషులో ఇచ్చినవి పరిశీలించబడవు. ప్రజలు తమ కష్టసుఖాలను తమకు వచ్చిన భాషలో తమంత తామే ప్రభుత్వానికి చెప్పుకోవాలి..." అని ఒక ఆదేశాన్ని జారీ చేశాడు. 1-8-1795న వీరన్న అనే పౌరుడు ఆంగ్లంలో పిటీషన్ ఇచ్చిన కారణంగా అతని ఫిర్యాదు తిరస్కరించాడు కూడా (ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర ఆర్కయివ్స్ మచిలీపట్టణం రికార్డు). మన పాలకుల్లో 'మిష్టర్ ర్యాంఘామ్' లు తయారు కావాలి.

తొలి అధికారభాష సంఘం అధ్యక్షులు శ్రీవావిలాల గోపాలకృష్ణయ్య 1974

ఆగష్టు, 6న తెలుగు అకాడెమీ 6వ వార్షికోత్సవ సందర్భంగా చేసిన ప్రసంగంలో "కోర్టుభాష"గురించి ప్రస్తావిస్తూ, క్రిమినల్ ప్రొసీజరు కోడు కొత్తది వచ్చినప్పుడు హిందీ వాళ్ళు ఎవ్వరికీ చెప్పకుండా కోర్టుభాషలో హిందీని మాత్రం చేర్చుకున్నారు. దక్షిణాది రాష్ట్రాల కోర్టులలో హిందీవాళ్ళతో సమానంగా 'తెలుగు కోర్టుభాష' తెచ్చుకోలేక పోయామని బాధపడ్డారు. భాషకేదైనా మేలు చేసినవారి గురించి ఘనంగా చెప్పుకుంటాం. ఏమీ చేయనివారి గురించి చెప్పేదేముందీ......???

"మాతృభాషలో సామాన్య జనం మాట్లాడుకొనే పదాలన్నీ పోగుచేసి-కనీసం ట్వంటీయత్ సెంచురీ ఇంగ్లీషు డిక్షనరీ మాదిరి కావాలంటున్నాను. అటువంటిది ఇవ్వాళ ఉందా? అని అడుగుతున్నాను..." అని ఆవేశంగా ప్రశ్నించారు శ్రీ వావిలాల.

నలబైఐదేళ్ళ తర్వాత ఈరోజున వావిలాల వారు బ్రతికుంటే మళ్ళీ అదే ప్రశ్న అడగవలసి వచ్చినందుకు ఆవేదన చెందేవారు. తెలుగులో పాలన జరగటం లేదని భాషాభిమానులు వావిలాల వారిలాగానే బాధపడుతున్నారు. కానీ, అందుకు కావలసిన పరిభాషను అందించటానికి మన విశ్వవిద్యాలయాలు గానీ, తెలుగు అకాడెమీ గానీ, సాంస్కృతిక శాఖ గానీ, అధ్యక్షుడు ఉన్నప్పుడు మాత్రమే పనిచేసే అధికార భాషా సంఘం గానీ, అరకొరగా తప్ప ఏదీ ఇన్నేళ్లుగా పరిపూర్ణ కృషి చెయ్యలేదు. భాష లేకుండా న్యాయమూ, చట్టమూ, ధర్మమూ లేవు. పాటించే ప్రజల భాషలోనే వాటిని రాయాలనేది అంతర్జాతీయ సూత్రం! ప్రజలకు రాని భాషలో వ్రాసి పాటించలేదంటే కుదరదు.

యునెస్కో అంతర్జాతీయ మాతృభాషా దినోత్సవాన్ని ప్రకటించాక, "భాషల రోదసిలో ప్రతి పదమూ ఒక మెరిసే నక్షత్రమే" అనే నినాదంతో అంతర్జాతీయ మాతృభాషల పరిరక్షణోద్యమం ఊపందుకొంది. ఒక భాషని, దాని పదసంపదని తక్కువ చేస్తే భాషా వివక్షగా పరిగణించాలని, మాతృభాషని ప్రాథమికహక్కుగా ప్రకటించాలనీ, ప్రతి భాషలో సామాన్యుడి కోసం పరిభాష కావాలనీ కోరుతున్నారు. సమాచారాన్ని, పరిజ్ఞానాన్ని పరిభాష సూత్రీకరిస్తుంది. తల్లిభాషలో పరిభాష ప్రచారంగా ఉంటే సమాచార నైపుణ్యం, మానవ సంబంధాలు, వ్యవహార నాణ్యతలు పెరుగుతాయి.

యూరోపియన్ అకాడెమీ మాతృభాషలలో Post Graduation diploma courses in Terminology నడుపుతోంది. ట్రెంటో(ఇటలీ)లో ఉండే జెర్మనీ మైనారిటీ "మొచెనీ"భాషలో పరిభాష కోసం 2008 నుంచి ప్రతి ఏడాదీ రెండురోజుల పారిభాషిక శిక్షణా శిబిరాలు నిర్వహిస్తున్నారు.

చాలా దేశాలలో పరిభాషా సంఘాలు Terminology Commission) పని చేస్తున్నాయి. పౌరపాలన, న్యాయపాలనా రంగాలను స్థానిక భాషలో నిర్వహించటం ప్రజల ప్రాథమిక హక్కుగా భావిస్తున్న దేశాలున్నాయి. నిర్ణయాధికారం గల "తెలుగు పరిభాషా ప్రాధికార సంస్థ (టెర్మినాలజీ అథారిటీ)" ఏర్పడాలి. కేంద్ర ప్రభుత్వ కార్యాలయాల్లో హిందీ ఆఫీసర్ల పద్ధతిలోనే రాష్ట్ర ప్రభుత్వ కార్యాలయాల్లో తెలుగుభాష అధికార్లను నియమించాలి. వారిని అందుకోసమే తప్ప వేరే ఇతర పనులకు వినియోగించరాదని గట్టి చట్టం చేసి, పాలనాపదాల సమీకరణలో వారిని భాగస్వాములు చేయాలి.

ఆక్స్‌ఫర్డ్ నిఘంటువును ప్రతి ఏడూ పెంపుచేస్తూ, కొత్తపదాలు సూచించాలని ప్రపంచ ప్రజలను కోరినట్టే, ఇంగ్లీషు పరిభాషకు సమానమైన తెలుగుపదాలను సూచించటానికి తెలుగు ప్రజలకు అవకాశం ఇవ్వాలి. తెలుగు ఇంగ్లీషు మహా నిఘంటువు (లెక్సికాన్) తయారులో ప్రజలను వదిలేసి, ఒకరిద్దరు పండితులకు అప్పగిస్తే, జనంలోని పదాలు నిఘంటువులకు ఎన్నటికీ ఎక్కవు. జనం మాట్లాడుకునే ప్రతీ తెలుగుపదం, దాని ఇంగ్లీషు అనువాదం ఎప్పటికప్పుడు ఇంటర్నెట్‌కు అందించి చర్చకు పెట్టాలి. వావిలాలవారన్నట్టు అప్పుడు నదీప్రవాహంలో రాళ్లలా పదాలు అరిగిఅరిగి తెలుగు వజ్రాలు బయటపడతాయి.

## సాంకేతికతతో తెలుగు అనుసంధానం

పాణిని రెండు వేలయేళ్లకన్నా పూర్వమే కోడింగ్ పద్ధతిలో భాషను అధ్యయనం చేసే విధానాన్ని ప్రవేశపెట్టాడు. తాను స్వయంగా నిర్మించి, సంస్కరించి, మెరుగుపరచిన సంస్కృతాన్ని ఆయనే కోడింగ్ పద్ధతిలో పదిలపరిచాడు.

కంప్యూటర్లో ఒక భాషను వ్రాయటానిక్కూడా ఈ విధమైన కోడింగ్ పద్ధతినే పాటిస్తారు.

Computational Linguistics అనే శాస్త్ర విభాగం అభివృద్ధి చెందాక సంస్కృత భాషావతరణకు పాణిని చేసిన కృషిమీద కంప్యూటర్ భాషావేత్తలు దృష్టి సారించారు. 2007లో ప్రథమ సంస్కృత గణాంక (కంప్యుటేషనల్) మహాసభ జరిగింది. ఈ సదస్సులో 2700 యేళ్ల క్రితమే మానవ మేధ విశ్లేషించుకునేందుకు వీలుగా పాణిని సంస్కృతాన్ని కంప్యూటరీకరణం చేసిన వైనంపై చర్చచేశారు.

బాకస్-నౌర్ అనే ఇద్దరు కంప్యూటర్ శాస్త్ర నిపుణులు యూనీకోడ్ పద్ధతిలో కంప్యూటర్ భాష ఆవిష్కరణకు కృషిచేసిన వారు. కంప్యూటర్ భాషని ఆ ఇద్దరి పేరుతో బాకస్-నౌర్ విధానం అని పిలుస్తారు. వేల ఏళ్ళక్రితమే పాణిని భాష

కోడింగ్ పద్ధతిని ప్రవేశపెట్టిన విధానం తెలిశాక పాశ్చాత్య పండితులు ఆశ్చర్యపోయారు. కోడింగ్ పద్ధతిని కంప్యూటర్లో ఒక భాషను వ్రాయటానికి "పాణిని-బాకస్-నౌర్ పద్ధతి" అనే వ్యవహార నామం ఇప్పుడు వ్యాప్తిలోకి వస్తోంది.

"ఇ-సంస్కృతం" ప్రచారంలోకి రావటానికి Gottingen Register of Electronic Texts in Indian Languages (GRETIL) ద్వారా అందుబాటులోకి తెస్తున్నారు. సమస్యా పరిష్కరణలు (algorithms) ఇంకా ఇతర ఉపకరణాల సాయంతో సంస్కృత భాషను కంప్యూటరీకరించే ప్రయత్నాలు చేస్తున్నారు. ముఖ్యంగా సంధి, సమాసాలపైన దృష్టి కేంద్రీకరిస్తున్నారు. సంస్కృతంలో ఆగమ, ఆదేశ, లోప, ప్రకృతీభవాలను కంప్యూటర్ గుర్తించేలా ఉపకరణాల కోసం కృషి చేస్తున్నారు. డిజిటలైజేషన్ ప్రక్రియ ఇంకా వేగవంతం కావాలి. సంధి, సమాసాల విశ్లేషకాలు (algorithms) అభివృద్ధి చెందితే గానీ ఇది సాధ్యం కాదు. ఈ కృషి మొత్తం తెలుగు భాషకూ అన్వయించి జరగాలి.

సంస్కృతం, తెలుగు సహా భారతీయ భాషలను డిజిటల్ ఫార్మాట్'లో యూనికోడ్ పరిధిలోకి తెచ్చేందుకు Unicode (UTF-8)standard [4] ప్రకారం యూనికోడ్ కన్సార్టియం అంతర్జాతీయ సంస్థ విశేష కృషిచేస్తోంది. భాషోద్యమం చేసిన విజ్ఞప్తికి స్పందించి, 2011లో ఉమ్మడి ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం యూనికోడ్ కన్సార్టియంలో సభ్యత్వం తీసుకొంది. కంప్యూటర్ ద్వారా యూనికోడ్'లో తెలుగు వ్రాయటానికి అందువలన అవకాశాలు మెరుగుపడ్డాయి.

తెలుగు లిపిని కంప్యూటరీకరించటం వరకూ ఔత్సాహికులైన కంప్యూటర్ రంగ నిపుణులు విశేషంగా కృషిచేశారు. వారికి ప్రభుత్వ గుర్తింపు లేకపోయినా వారి కృషి అజరామరం. నిజంగా పూనుకోవలసిన బాధ్యత కలిగిన భాషాపండితులకు ఈ రంగంలో శ్రద్ధలేకపోవటం, పరిచయం పెంచుకోకపోవటం బాధాకరం.

## 'సుడికావలి' కావాలి!

నేపాలీ భాషలో మసాలా అనే పదానికి కూరలో మసాలా ఎక్కువయ్యింది, సినిమాలో మసాలా రంజుగా ఉంది లాంటి సాధారణ అర్థాలకు అదనంగా మూడు కొత్త ప్రయోగాలున్నాయి.

1. ఈ పరిక్ష పాసవ్వటానికి ఏదైనా మసాలా(అడ్డదారి) ఉందా?
2. ఇందులో మసాలా (కిటుకు, రహస్యం) ఏంటి?
3. ఈ రేడియోలో మసాలా(బ్యాటరీ) చచ్చిపోయింది

ఇలా మసాలా అనే ఒక పరాయిపదానికి అర్థవిస్తృతి కల్పించుకో గలిగారు నేపాలీయులు. ఇలా ఒక పదం ఏ భాష లోంచి వచ్చిందో ఆ భాషీయులే ఆశ్చర్యపడేలా కొత్త అర్థాల్లో దాని ప్రయోగాలు జరగాలి. భాషను బలసంపన్నం చేసుకోవాలి. ఇది ఒకరిద్దరు పండితులు కూర్చుని వండితే తయారయ్యే వంట కాదు. జనసామాన్యం నాలుకలమీద ఆడి నిగ్గు తేలి నిఘంటువుల కెక్కాల్సిన విషయం.

భాషాపదాల రక్షకవ్యవస్థ ఉంటే భాషాభిమానం కలిగినవారు ఇలాంటి ప్రయోగాలను గుర్తించ గలుగుతారు. వాటికి వ్యాప్తి కలిగించ గలుగుతారు. మహాత్ముడు అలాంటి బాధ్యత స్వీకరించాల్సిందిగా పండితుల్ని కోరారు. పండితులు జనంలోకి వెడితే అక్కడి పదసంపద వెలికి వస్తుంది!

భాషాకాలుష్యానికి ప్రభుత్వ ఉదాసీనత, మాతృభాషకు వ్యతిరేకంగా మారిన విద్యావ్యవస్థ, మాతృభాష ప్రాధాన్యతను గుర్తించని తలిదండ్రులు, తెలుగులో పాలనకు వ్యతిరేకులైన అధికారులు ఈ అందరూ సమాన బాధ్యులే! ఎలక్ట్రానిక్ మీడియాదీ గణనీయ పాత్రే! వాణిజ్య సంస్కృతిలో ప్రభుత్వాలే లీనమైపోతుంటే వాణిజ్య సంస్థలు మడికట్టుకుని ఉండలేవు కూడా!

నిజానికి, వ్యాకరణ రక్షణలో ఉన్న గ్రాంథిక తెలుగు భాషకు మరణించే దుర్గతి ఎన్నటికీ పట్టదు. సంస్కృతం, హిబ్రూ లాంటి భాషల్లాగే మాట్లాడే వారు లేకపోయినా అవి బ్రతికుంటాయి. తెలుగు గ్రంథస్థ భాషక్కూడా అలానే మరణం ఉండదు. కలవరం అంతా వాడుక తెలుగు గురించే!

"టెంపులుకు వెళ్ళి కోకోనట్ బ్రేక్ చేసింది!", "బస్సు రోడ్డున స్పీడుగా పోయింది"...లాంటి తెలుగు వాక్యాల్లో చేసింది, పోయింది మాత్రమే తెలుగు. అవి కూడా ఎప్పుడు పోతాయో చెప్పలేం. మనం తెలుగు వాళ్ళుగానే ఉంటాం. తెలుగే మాట్లాడుతుంటాం. కానీ అందులో తెలుగు ఉండదు. ఇదే భాషా కాలుష్యం అంటే! భాషాకాలుష్యం అంతా వాడుకభాషలోనే జరుగుతోంది. వ్యాకరణ రక్షణ లేకపోవటాన చొరబాటుదార్లు, అతిక్రమణదార్ల తాకిడి ఎక్కువయ్యింది. ఈ దుండగీలను అరికట్టలేకపోతే తెలుగు భాషాంతాన్ని మనం కళ్ళారా చూసే ప్రమాదం పొంచి ఉందని హెచ్చరిక.

భాషతోపాటు, భాషామాధుర్యాన్ని, భాషాగౌరవాన్నీ కాపాడుకోవలసిన సమయం వచ్చింది.

పుస్తకాల్లో వాడే భాషకీ, జనం వాడుకలో భాషకీ నానాటికీ ఎడం పెరుగుతున్న నిజాన్ని మనం గుర్తించట్లేదు. వ్యాకరణ సూత్రాలు భాషను సంరక్షిస్తాయని తెలిసినా, పండితులు ప్రజల వాడుకభాషకు వ్యాకరణ సూత్రాలను ఏర్పరచలేకపోతున్నారు.

తెలుగులోనే కాదు, ఇంగ్లీషులో కూడా పామరభాషకు వ్యాకరణ సూత్రాల్లేవు. ఆంగ్లభాషలో వాడుక పదాల సంఖ్య ప్రతీ ఏడాదీ పెరుగుతోంటే, తెలుగులో నానాటికీ తరిగిపోతున్నాయి. ఒక వైపున పామరభాష కొత్తపుంతలు తొక్కుతూ పోతోంది. మనం లెక్కించలేనన్ని కొత్తమాటలు తెలుగు ప్రజల నాలుకలమీద చేరి ఆడుతున్నాయి. కొత్త అవసరాలు ఏర్పడే కొద్దీ, కొత్త వస్తువులు వస్తాయి. వాటి వాడకానికి కొత్త పదసంపద భాషకు అందుతుంది. వాటిని స్వీకరించటానికి పండిత లోకానికి అహం అడ్డువస్తోంది. అందువలన భాష ఆధునీకరణ ఆగిపోతోంది.

వాణిజ్య, పాలనా, బోధనా వ్యవహారాలన్నింటికీ సరళ గ్రాంథిక భాష, తక్కిన దైనందిన వ్యవహారాలకు జనబాష కావాలి. తెలుగులో ఈ రెండింటి సమన్వయం అవసరం. పండితులు, పామరుల మధ్య భాష రెండుగా చీలిపోవటం సమాజానికి ఆరోగ్యదాయకం కాదు.

నిజానికి భాషను బతికించేది పామరులేగాని, పండితులు కాదు. పండితభాష గ్రంథాల్లోనూ, పామరభాష జనం నాలుకల మీదా బతుకుతుంది. జనంలో బతికేదే అసలు భాష. దానిగురించి పండితులు పట్టించుకోవాలనేదే అభ్యర్థన. అలాగని, క్షౌరశాలని 'కేశ రిమూవనీ శాల' అంటే కృతకంగా ఉంటుంది. 'ఇక్కడ తలవెంట్రుకలు నరకబడును" అంటే భయంకరంగా ఉంటుంది. గ్రాంథికానికీ, వ్యావహారానికి తేడా ఇదే! మనం ఇప్పుడు సరళ వ్యవహారం, సరళ గ్రాంథికాల మీద దృష్టి పెట్టాలి. తెలుగు భాషాపరిరక్షణకు ఒక 'నుడికావలి' వ్యవస్థ కావాలి.

ఒక వ్యక్తి యొక్క సామాజిక స్థితి (social and ethnic status)ని ఆ వ్యక్తి మాట్లాడే భాషని బట్టి నిర్ణయించే పరిస్థితి మారాలి. ఇంగ్లీషు మాట్లాడే వాడే ఉత్తమ పౌరుడని భావించటం ఖచ్చితంగా వివక్షే! గ్లాస్ నోస్త్ విధానాన్ని ప్రకటించిన గోర్బచేవ్ "Korenizatsiya (కొరెనిజత్సియ)"-ఒక పరాయి భాషని స్థానిక భాషగా స్వీకరించటం (ఇండిజనైజేషన్) అనే విధానాన్ని ప్రకటించిన సంగతి ఇక్కడ గుర్తుచేసుకుందాం.

## భాష ఎందుకు మరణిస్తుంది?

నిజానికి యునెస్కో ప్రకటించిన 'అంతరించే భాషల అట్లాసు'లో తెలుగు పేరు లేదు. అలాగని యునెస్కో వారే ప్రకటించిన సురక్షిత భాషల పట్టికలో కూడా తెలుగు లేదు. దీన్ని బట్టి తెలుగుభాషకు తక్షణ ప్రమాదం లేకపోయినప్పటికీ, ప్రమాదం పొంచి ఉన్న భాషగా భావించి కొన్ని ప్రత్యేక జాగ్రత్తలు తీసుకోవలసిన అవసరం ఉంది.

1996 నాటి ఒక సర్వే నివేదిక ప్రకారం, ప్రపంచవ్యాప్తంగా 6,703 మాతృభాషలు సజీవంగా ఉన్నాయి. వాటిలో 1000 భాషలు ఒక్క అమెరికా

ఖండాలలోనే ఉన్నాయి. ఆఫ్రికాలో 2011 మాతృభాషలు, యూరప్ లో225, ఆసియాలో 2165, పసిఫిక్ దేశాలలో 1320 మాతృభాషలున్నాయి. కొన్ని చోట్ల యాసలు (dialects) కూడా ప్రత్యేక భాషలుగా ఉన్నాయి. అన్నీ కలిపి 5,000 వరకూ మాతృభాషల్ని గుర్తించారు. ఒక వందేళ్ల కాలంలో ఈ భాషల్లో ఎన్ని సజీవంగా ఉంటాయో చెప్పలేం. రానున్న 80 యేళ్లలో వీటిలో సగం అంటే 2,500 భాషలు పూర్తిగా కనుమరుగై పోతాయని నిపుణులు చెప్తున్నారు. ఇదంతా భాషాపరమైన వైపరీత్యమే (linguistic devastation).

సురక్షితం అనదగిన భాషలు 5-10% వరకు మాత్రమే ఉన్నాయి. ఇంగ్లీషు, స్పానిష్, పోర్చుగీస్, మాండేరిన్, చైనీస్, రష్యన్, అరెబిక్, స్వాహిలి, హిందీ లాంటి కొన్ని భాషలు తప్ప తక్కినవి త్వరలో ముప్పును ఎదుర్కోక తప్పదు.

6,000 ప్రపంచ మాతృభాషల్లో 2,572 భాషల పరిస్థితి అగమ్యగోచరంగా ఉంది. వాటిలో 1,907 భాషలు మాట్లాడేవారి సంఖ్య 10,000కంటే తక్కువ. మరో 368 భాషల వ్యవహర్తలు పదివేల నుండి లక్ష లోపు ఉన్నారు. లక్షకంటే ఎక్కువ మంది ఉన్నవి 121 వరకూ ఉన్నాయి. భారతీయ భాషలైన 'అహోం', 'అంద్రో', 'రంగ్కాస, 'సెంగ్మయి', 'తోల్చా' లాంటి భాషలు మాట్లాడేవారు స్వాతంత్ర్యం వచ్చాక పూర్తిగా అంతరించి పోయారు. ఇప్పుడు ఆ భాషలు మాట్లాడేవారు ఒక్కరుకూడా లేరు.

CENSUS OF INDIA వారు గత 5 సార్లుగా చేసిన జనాభా లెక్కల ఆధారంగా కొన్ని భారతీయ మాతృభాషలు, వాటిని మాట్లాడే జనాభా వివరాలివి:

| | 1971 | 1981 | 1991 | 2001 | 2011 |
|---|---|---|---|---|---|
| హిందీ | 20,27,67,971 | 25,77,49,009 | 32,95,05,193 | 42,20,48,642 | 52,83,47,193 |
| బెంగాలీ | 4,47,92,312 | 5,12,98,319 | 6,95,95,738 | 8,33,69,769 | 9,72,37,669 |
| మరాఠీ | 4,17,65,190 | 4,94,52,922 | 6,24,81,681 | 7,19,36,894 | 8,30,26,680 |
| తెలుగు | 4,47,56,923 | 5,06,24,611 | 6,60,17,615 | 7,40,02,856 | 8,11,27,740 |
| తమిళం | 3,76,90,106 | 5,30,06,368 | 6,07,93,814 | 6,90,26,881 | 7,21,47,030 |
| గుజరాతీ | 2,58,65,012 | 3,30,63,267 | 4,06,95,370 | 4,60,91,617 | 5,54,92,554 |
| ఉర్దూ | 2,86,20,895 | 3,49,41,435 | 4,34,06,932 | 5,15,36,111 | 5,07,72,631 |
| మలయాళం | 2,19,38,760 | 2,57,00,705 | 3,03,77,176 | 3,30,66,392 | 3,48,38,819 |
| కన్నడం | 2,17,10,649 | 2,56,97,146 | 3,27,53,676 | 3,76,81,520 | 4,37,06,512 |
| ఒడియా | 1,98,63,198 | 2,30,21,528 | 2,80,61,313 | 3,30,17,446 | 3,75,21,324 |
| సంస్కృతం | 2,212 | 6,106 | 49,736 | 14,135 | 24,821 |

దేశంలోని ప్రధాన భాషల స్థితిగతులు భారతదేశంలో షుమారుగా 44% మంది ప్రజలు హిందీని మాట్లాడుతున్నారు. 2001లో వీరి సంఖ్య 41.03% ఉండగా, 2011 సెన్సస్ ప్రకారం 43.63%కి పెరిగింది. బెంగాలీ, తెలుగు, మరాఠీ భాషలు హిందీ తరువాతి స్థానాలలో కొనసాగుతున్నాయి.

ఈ పట్టికలో మరాఠీ వేగంగా పెరగటాన్ని గమనించాలి. వారు అవలంభిస్తున్న విధానాలను తెలుసుకుంటే తెలుగు భాషీయుల సంఖ్య చేజార్చుకోకుండా ఉండగలుగుతాం. హిందీలోంచి మైథిలీని వేరుచేసి, దాన్ని వేరే షెడ్యూలు భాషగా ప్రకటించిన తరువాత కూడా హిందీ మాట్లాడేవారి సంఖ్య పెరగటానికి, తెలుగు తగ్గి పోవటానికి కారణాలు ఏమిటీ? ఏ పరిస్థితులు ప్రభావం కలిగిస్తున్నాయి? మనం సరిచేసుకోవలసిన అంశాలున్నాయా?

2001లో 7.19%గా ఉన్న తెలుగు ప్రజలు 2011 సెన్సస్ నాటికి 6.93కి తగ్గారు. బెంగాలీలు 8.11% నుండి 8.3%కి పెరిగారు. మరాఠీలు 6.99 నుండి 7.09%కి పెరిగారు.

భాషకు సంబంధించిన 2011 సెన్సస్ వివరాలను 2018 జూన్ 26న విడుదల చేశారు. దీని ప్రకారం ఉత్తరాదిలో హిందీ, దాని యాసలన్నీ కలిసి 25.19% మేర వేగంగా పెరుగుతూ ఉండగా దక్షిణాది భాషల్లో ఈ వేగం మందగించింది.

దేశజనాభాతో పోల్చినప్పుడు తెలుగు మాట్లాడేవారి శాతం తగ్గుముఖంలో పడి 3వ స్థానం నుండి 4వ స్థానానికి దిగిపోయింది. దక్షిణాదిలో కన్నడ భాషీయులు మాత్రమే 3.69% నుండి 3.73%కు పెరిగారు. తమిళులు 13,54% మంది పెరగగా, తెలుగువారు 9.63% నుండి 8.11%కి తగ్గిపోయారు. మళయాళం మాట్లాడేవారు 3.21% నుండి 2.97%కి తగ్గటం ఆందోళనకరమే!

ప్రపంచ భాషల వరుసక్రమములో 15 కోట్లమందికి పైగా తెలుగు మాతృభాషగా కలిగినవారితో కలిపి తెలుగు భాష 15వ స్థానంలో ఉంది. ఫ్రాన్సు, బ్రిటన్లతో సహా 110 దేశాల కంటే తెలుగునేల సువిశాలమైనది.

నిన్న మొన్నటిదాకా దేశంలో హిందీ తరువాత రెండో స్థానంలో ఉన్న తెలుగు భాషను జాతీయ భాషగా గుర్తించాలని జెబిఎస్ హాల్డేన్ వంటి వైజ్ఞానికులు కూడా సూచించారు.

స్వాతంత్ర్యానికి పూర్వం గానీ, స్వాతంత్ర్యం తరువాత గానీ తమిళనాడుకు మొత్తం 15 మంది ముఖ్యమంత్రులుగా పనిచేయగా వారిలో 12 మంది తెలుగువారు. తమిళనాడు జనాభాలో తమిళులు 36% కాగా తెలుగువారు 42% మేరకు ఉన్నారని

ఒక అంచనా! కానీ వారెవరూ తాము తెలుగు వారిమని, తమ మూలాలు తెలుగేనని ధైర్యంగా చెప్పుకోలేక పోతున్నారు. తమిళం మాతృభాష కానివారు తమిళ నేలమీద పుట్టిపెరిగినా వారిని స్థానికేతరులుగా ముద్రవేసి, ఉపాధి అవకాశాలను కోల్పోయేలా చేయటం అక్కడ జరుగుతున్న ఒక తంతు. తెలుగు ప్రభుత్వాలకు ఏ మాత్రం పట్టని అంశం ఇది.

## భాష ఇలా మరణిస్తుంది...?

అత్యంత ప్రమాదకర స్థితిలో ఉన్న భాషను మాట్లాడే చిట్టచివరి వ్యక్తి కూడా మరణించాక ఆ భాష పూర్తిగా మరణిస్తుంది. భవిష్యత్తులో ఇలా 'కనిపించకుండా పోయే ప్రమాదంలో ఉన్న భాష' లు ప్రపంచ వ్యాప్తంగా ఎన్నో ఉన్నాయి.

మెక్సికోలో స్పానిష్ భాష అక్కడి స్థానిక భాషల మరణానికి కారణం అవుతోంది. భారతదేశంలో ఇంగ్లీషుది అదే పాత్ర!

దక్షిణాఫ్రికాలో Ouma Aenki Kassie, అనే పండు ముసలి అవ్వ ఆ భాష మాట్లాడేవారిలో చిట్టచివరి వ్యక్తి. ఆమె మరణంతో ఆమె భాష కూడా అంతరించింది. "గ్యానీ మైయా సేన్" అనే నేపాలీ వయోవృద్ధుడు 'కుసున్దా' అనే భాష మాట్లాడే వారిలో చిట్టచివరి వ్యక్తి. Nluu అనే భాష మాట్లాడే వారు ప్రపంచంలో కేవలం 10 మందే ఉన్నారు. వారిలో ఒకాయన ఇటీవలే మరణించాడు. అండమాన్ దీవుల్లో జేరూ అనే భాష ఉంది. 2007లో ఈ భాష మాట్లాడేవారు 5మంది మాత్రమే ఉన్నారు. నేపాల్లో Dumi భాషీయులు 8 మంది, రష్యాలో 'టెర్ షమీ' భాషీయులు 8 మంది ఉన్నారు. ఇలా ఎన్నో ఉదంతాలు...!

**భాష మరణానికి దారితీసే వివిధ దశలు :**

1. సురక్షితమైన భాష (Safe) : ఒక భాష మాట్లాడే ప్రజలు అందరూ అనేక తరాలుగా ఆ భాషను మాట్లాడేవారుగా ఉన్నప్పుడు ఆ భాష సురక్షితమైనదౌతుంది.

2. బలహీన భాష (vulnerable) : ముఖ్యంగా పిల్లలు ఇంట్లో మాత్రమే మాట్లాడుతూ, బైట వ్యవహారాలకు పరాయి భాషని మాట్లాడే వారు ఎక్కువగా ఉన్నప్పుడు అది బలహీనమైనదిగానూ, ప్రమాదం అంచున ఉన్నదిగానూ భావించవలసి ఉంటుంది.

3. ఖచ్చితంగా ప్రమాదాన ఉన్న భాష (Definitely endangered) : ఏ భాషకు చెందిన పిల్లలు తమ భాషను నేర్చుకోవటం, మాట్లాడటం చెయ్యరో అది "ఖచ్చితంగా ప్రమాదాన ఉన్న భాష" అవుతుంది.

4. తీవ్ర ప్రమాదాన ఉన్న భాష (Severely endangered): ఇంట్లో పెద్దవాళ్లు మాత్రమే మాట్లాడేవారుగానూ, తల్లిదండ్రులు మాత్రం ఆ భాషని ఒకరితోఒకరు గానీ తమ పిల్లలతోగానీ మాట్లాడకుండా ఉన్నప్పుడు అలాంటి వ్యక్తుల మాతృభాష తీవ్ర ప్రమాదాన్ని ఎదుర్కొంటున్నట్టు భావించవలసి ఉంటుంది.

5. అతి తీవ్ర ప్రమాదాన ఉన్న భాష (Critically endangered): బాగా పండు ముసలివాళ్లు మాత్రమే అరకొరగా మాట్లాడే భాష.

6. మరణించిన భాష (Extinct) : 1950 నుండీ ఏ భాష మాట్లాడే వారు ఒక్కరు కూడా మిగిలి లేరో అది మృతభాష.

యునెస్కో 2010లో ప్రకటించిన "ప్రమాదం ఎదుర్కొంటున్న భాషల పట్టిక" (Atlas of the World's Languages in Danger)లో రమారమి 2,500-3,000 భాషలు వివిధ స్థాయిల్లో ప్రపంచవ్యాప్తంగా ప్రమాదాన్ని ఎదుర్కొంటున్నవి కాగా, వాటిలో 1950 తరువాత 230 భాషలు పూర్తిగా మరణించాయని పేర్కొంది.

మన మాతృభాషతోపాటుగా మన చుట్టూ ఉన్న అనేక ఇతర మాతృభాషల ఉనికిని కాపాడటం అనేది విశ్వవ్యాప్తంగా జరగాలని యునెస్కో సందేశం. భిన్న భాషా సంస్కృతుల కూటమి ఈ ప్రపంచం. భాషా భిన్నత్వాన్ని గౌరవించి కాపాడుకోవటం మన ధర్మం.

చరిత్రలో మారణహోమాలు, దమనకాండలు అనేకం జరిగాయి. 19వ శతాబ్దిలో యురోపియన్ దురాక్రమణదారులు టాస్మేనియన్లను సమూలంగా నిర్మూలించారు. ఆ నరమేధంలో ఒక్కడు కూడా మిగిలి లేకపోవటాన ఎన్ని మాతృభాషలు అంతరించి పోయి ఉంటాయో ఊహించలేం. భాష ఇలా కూడా మరణిస్తుంది

ఎల్ సాల్వడారులో లెంకా, చాకోపేరా జాతీయుల మీద 1932లో జరిపిన దాడులు భయానకమైనవి. సాల్వడార్ బంట్లు వేలాదిమందిని ఊచకోత కోశారు. అందుకని ఈ ఆదివాసీలు తమ మాతృభాషల్ని వదులుకోక తప్పని పరిస్థితి ఏర్పడింది. భాష మరణాలకు ఇలాంటి రాజకీయ కారణాలు కూడా ఉంటాయి.

తమిళనాడులో తెలుగు ప్రజలపట్ల జరుగుతున్న దౌష్ట్యాల కారణంగా అక్కడి ప్రజలు తమ మాతృభాష తెలుగు అని సెన్సస్ జరిగే సమయంలో చెప్పుకో లేకపోతున్నారు. చెప్తే, వాళ్లని స్థానికేతరులుగా పరిగణిస్తారు. విద్య, ఉద్యోగ ఉపాధి సదుపాయాలు వారికి ఆ రాష్ట్రంలో దక్కకుండా పోతాయి. దేశంలో తెలుగు భాష మూడోస్థానం లోంచి, నాలుగోస్థానం లోకి దిగిపోవటానికి ఇదీ కారణమే!

ఇప్పటికీ మద్రాస్, మధురై, రాజుపాళ్యం, తంజావూరు కంచి ఇంకా చాలా ప్రాంతాలలో తెలుగు వారు 17-18 శతాబ్దాల నాటి తెలుగు భాషను నిలబెట్టుకుంటూ వస్తున్నారు. వారు మాట్లాడే పదాల్లో అమూల్యమైన తెలుగు నుడులున్నాయి. వాటిని రికార్డు చేయటం ముందుగా జరగాలి. చాలా ఇంగ్లీషుమాటలకు సరైన తెలుగు పదాలు వీరు మాట్లాడే తెలుగు భాషలో ఉన్నాయి. కానీ, కొందరు వయోవృద్ధులకు తప్ప వారి సంతానానికి ఆ భాష రాదు. ఈ వయో వృద్ధుల తరువాత అక్కడ తెలుగు అంతరించి పోయే ప్రమాదం ఉంది. భాష ఇలానూ మరణిస్తుంది.

డెన్మార్క్ ఆధీనంలో గ్రీన్లాండ్ ఉంది. అక్కడి ప్రజల మాతృభాష 'కలాల్లిసుత్'. డేనిష్ పాలకులు ఆ భాషను, వారి సంస్కృతిని వదిలేయ వలసిందిగా వీళ్ల మీద వత్తిడి చేస్తున్నారు. టర్కీలో కుర్ద్స్ విషయంలోనూ ఇదే జరుగుతోంది. భాష మరణించే కారణాలలో ఇలాంటివీ ఉంటాయి.

అమెరికన్ బోర్డింగ్ స్కూళ్లలో స్థానిక భాషలను మాట్లాడే పిల్లలను శిక్షించే విధానం మెక్సికో లాంటి చోట్ల ఇంకా కొనసాగుతోంది. ఆస్ట్రేలియాలోనూ ఇదే ధోరణి. ఒక ప్రధాన భాష దాని పరిసరాలలోని అనేక మాతృభాషల మీద ఈ విధమైన జులుం చెలాయించటం ప్రపంచవ్యాప్తంగా కొనసాగుతోంది.

ఇళ్లలో పెద్దవాళ్లు తమ మాతృభాషను తమ పిల్లలకు నేర్పించటం మానేస్తే, రెండు మూడు తరాల కాలంలోనే ఎంత పెద్ద బాషయినా మరణించే అవకాశం ఉంది. భాషలను వ్రాతపూర్వకంగా నిలవ చేస్తేనే భద్రంగా ఉంటాయి. పుస్తకాలు భాషను బతికిస్తాయి. పుస్తకాల్లేని భాషలు ప్రమాద స్థితిలో ఉన్నట్టే!

అలస్కా దేశంలో 'యూపిక్' మాతృభాష మాట్లాడే ఎస్కిమో ప్రజలు 20 సంవత్సరాల క్రితం వరకూ కూడా తమ పిల్లలకు యూపిక్ భాషను నేర్పించేవాళ్లు. ఇప్పుడు వారి పిల్లలకు కేవలం ఇంగ్లీషు మాత్రమే నేర్పిస్తున్నారు. అంటే 70-80 యేళ్ల తరువాత యూపిక్ భాష కనుమరుగై పోయే ప్రమాదంలో ఉన్నట్టే కదా...? భాష ఇలానూ మరణిస్తుంది.

'న్యూ గినియా' లోని పపువా తెగల ప్రజల్లో 900 మాతృభాషలున్నాయి. ఆస్ట్రేలియాలో స్థానిక ఆదిమ జాతులు మాట్లాడే భాషలు అతిత్వరలోనే 80% వరకూ మరణించబోతున్నాయి. అమెరికన్ ఆదివాసీలు ముఖ్యంగా ఇంకా మయా జాతుల భాషలు పెను ప్రమాదాన్ని ఎదుర్కొంటున్నాయి. నాగరికుల బాషలకన్నా ఆదివాసీల బాషలు తరువాతి తరాలకు నేర్పే విద్యావ్యవస్థ కొరవడటం వలన ముందుగా మరణిస్తాయి.

నాగరికుల మాతృభాష మరణించటానికి వాళ్ల పిల్లలు దాన్ని నేర్చుకోకపోవటం, వాళ్లకు మాతృభాష నేర్పకూడదని విద్యావ్యవస్థ భావించటం అమెరికా, ఆస్ట్రేలియా, యూరోప్ ఆఫ్రికా ఇంకా అనేక ఆసియా దేశాలలో ఎక్కువగా జరుగుతోంది.

ఆంగ్లేతర భాషల్లో సురక్షితంగా ఉన్న భాషలు 33 వరకూ ఉన్నాయనుకుంటే, వారి పిల్లలు కూడా ఇంగ్లీషునే ఎంచుకోవటాన అవి సురక్షితం అనే స్థితిని కోల్పోయే పరిస్థితి ఫ్రెంచి, చైనా భాషలకూ పొంచి ఉంది. వాటితో పోల్చినప్పుడు తెలుగు మరింత ఎక్కువ ప్రమాదాన్ని ఎదుర్కొంటున్నట్టు లెక్క!

సంస్కృతి పట్ల పిల్లలలో వ్యతిరేక భావాలను పెంచటం, మాతృభాష తమ అవసరాలకు చాలదనే అభిప్రాయాన్ని కల్పించటం, సామాజిక విలువలు, నైతిక విలువలు ఉపయోగం లేనివనే భావన కలిగించటం, వాణిజ్యపరమైన బావజాలాన్ని బుర్రల్లోకి ఎక్కించటం, రెక్కలు కట్టుకుని అమెరికా ఎగిరిపోవాలనే ఆశలు రేకెత్తించటం ఇవన్నీ మాతృభాషా సంస్కృతుల మరణానికి ప్రేరకాలే! ఈ పాపానికి ప్రభుత్వాల ఊతంతో విద్యాసంస్థలు ఒడిగట్టున్నాయనేది ప్రత్యక్ష ప్రమాణం.

## మాతృభాషను కోల్పోతే ఏమౌతుంది?

ఒక జాతి తన భాషను కోల్పోతే దానితో పాటే దాని ఉనికిని, దాని అస్థిత్వాన్ని కూడా కోల్పోతుంది. స్వయంకృతమైనా పరకృతమైనా భాషను కోల్పోవటం అనేది ఓటమిని అంగీకరించటమే! కాలిఫోర్నియాలో Chumash అనే భాషకు చెందిన ఆదివాసీ ప్రజలున్నారు. కానీ, వారెవరికీ ఆ భాష తెలీదు. వారి సంస్కృతి, ఆచార వ్యవహారాలు, భాష అన్నింటినీ వదులేసుకుని కాలిఫోర్నియాలో పరాయివారిగా జీవిస్తున్నారు. ఒక జాతిగా వారు ఓడిపోయి తమ ఉనికి కోల్పోయారు.

మనిషి మనసు జన్యుపరంగా తరతరాలుగా మాతృభాషలోనే రూపొందుతుంది. దీనిని అనుసరించే మేథా సంపత్తులు వృద్ధిపొందుతాయి. మూడో లేక నాలుగో యేడు వచ్చిందని తెచ్చి పిల్లల్ని స్కూల్లో వేయగానే వాళ్లకి మాతృభాష తెలీకుండా ఒక కొత్తభాషని బుర్రనిండా కుక్కేయాలని చూడటం వలన వారికి మనోవికాసం కలుగుతుందనుకోవటం అపోహ. మాతృభాషని మార్చుకొని వేరే భాషీయులుగా మారిపోయిన జాతులు కూడా ప్రతిభావ్యుత్పత్తుల్లో వెనకబడే ఉంటారు. కొత్తభాష మాతృభాష కావటానికి అనేక తరాల పాటు జన్యు మార్పులు పొందవలసి ఉంటుంది.

పోటీ యుగంలో వ్యక్తిత్వ వికాసానికి మాతృభాష కీలకమైన పాత్ర వహిస్తుంది. మన వ్యక్తిత్వవికాస నిపుణులు సమాచార నాణ్యత (effective communication)

ఇంగ్లీషుతోనే సాధ్యం అనే అపోహని కలిగిస్తున్నారు. మాతృభాషలోనే చెప్పుకోలేనివాడు వచ్చీరాని అరువుభాషలో effectiveగా చెప్పగలడని మనల్ని నమ్మించాలని చూస్తున్నారు.

ప్రాథమిక, మాధ్యమిక విద్యాలయాలలో మాతృభాషలను తగురీతిలో నేర్పించటం వలన మాతృభాషల మరణాన్ని నిరోధించ వచ్చని యునెస్కో నిపుణులు చెప్తున్నారు. ముఖ్యంగా యువతరంలో బాషాభిమానాన్ని పెంపొందించే కార్యక్రమాలు విస్తృతంగా చేయాలని కూడా సూచిస్తున్నారు.

భాషను ఆధునిక సాంకేతిక పరిజ్ఞానంతో భాషావేత్తల సహకారంతో నిలవచేస్తే, ప్రమాదవశాత్తూ ఏదైనా బాష మరణించినా దానిని పునరుజ్జీవనం చేసే అవకాశం ఉంటుంది.

మాతృభాషలన్నింటికీ నిఘంటువులను తయారు చేయటం, పదాల పట్టికను రూపొందించటం, సమీప ప్రధాన భాషతోగానీ ఇంగ్లీషుతోగాని సమానార్థకాలను తయారు చేయటం, కొందరికైనా ఆ భాషను నేర్పించటం, ఆ భాషలో పాఠ్యపుస్తకాల్ని శాస్త్రీయమైన రీతిలో తయారు చేయటం, అంతర్జాలంతో అనుసంధానం చేయటం లాంటి ప్రయత్నాలు భాషలను రక్షిస్తాయి.

ప్రతీ విశ్వవిద్యాలయంలోనూ తమ ప్రాంతాలలో అంతరించే అవకాశం ఉన్న భాషల అధ్యయన కేంద్రాలు ఏర్పాటు చేసి, పరిశోధనలు ముమ్మరం చేయాలి.

అండమాన్ దీవుల్లో 'అకా-బో' అనే భాష ఉండేది. 2010లో బోవా అనే 85 యేళ్ల వృద్ధురాలు మరణించటంతో అ భాష తెలిసిన వారు లేకుండా పోయారు. ఆమెతోపాటే ఆమె "అకా-బో"భాషకూడా మృత్యువు పాలయ్యింది. అయితే అరుప్ కుమార్ నాథ్ అనే భాషావేత్త ప్రస్తుతం తేజ్ పురి విశ్వవిద్యాలయంలో "ప్రమాదం ఎదుర్కొనే భాషల కేంద్రం"లో పరిశోధకుడిగా ఉన్నారు. ఆయన జవహర్లాల్ విశ్వవిద్యాలయం పక్షాన "అండమానీయుల స్వరాలు'పేరుతో ఆడియో వీడియో టేపుల ద్వారా అనేక అండమానీయుల భాషల స్వరూప స్వబావాలను రికార్డ్ చేశాడు. 'అకా-బో"భాష వివరాలను బోవాగారి ద్వారా సేకరించి రికార్డ్ చేయటంతో ఆ భాషకు కొంత ఆధారం దక్కింది. ఇలాంటి కార్యక్రమాలు తెలుగు నేలపైన సజీవంగా ఉన్న అన్ని మాతృభాషల విషయంలోనూ జరగాలి.

## దేశంలో పరిస్థితి

ప్రాథమిక విద్యతో చెరలాడటం అనేది దేశవ్యాప్తంగా ఉన్న తంతే! విద్యను కార్పోరేట్ వ్యాపారంగా మారుస్తున్న వైనం దేశం అంతా జరుగుతోంది. విద్యావాణిజ్య

సంస్థలకు అధిక ఫీజులు కావాలంటే మాతృభాషా మాధ్యమం సరిపోదు. ఎల్. కే. జీని తెలుగు మీడియంలో చదవటానికి లక్షా ముప్పది వేల రూపాయల్ని ఏ తండ్రీ కట్టడు. వాళ్లతో కట్టించాలంటే విద్యాసంస్థలకు ఇంగ్లీషు మాధ్యమం తప్పనిసరి. ఎవరు అంగీకరించినా అంగీకరించకపోయినా ఇది ఆగేది కాదు. కానీ, అందుకోసం తెలుగు ద్వేషాన్ని రంగరించి పోయాలనుకోవటమే ప్రమాదకరం. చదువుల్లోంచి తెలుగును లేకుండా చేయాలనుకోవటంలో పైశాచిక ఆనందం ఉంది.

ఒకవేళ ఏ తల్లిదండ్రులైనా పొరబాటున 'మా పిల్లలకు తెలుగు నేర్పండి' అనడిగితే, తెలుగులో మార్కులు రావనీ, సంస్కృతంగానీ, ఫ్రెంచి గానీ నేర్చుకుంటే ఎక్కువ మార్కులు వస్తాయని నమ్మజెప్తారు. మీరు ఇంట్లో మీ పిల్లలతో తెలుగులో మాట్లాడితే వాళ్లకు ఇంగ్లీషు రాకుండా పోతుందని భయపెడతారు. పట్టు బలవంతంగా పిల్లలమీద ఇంగ్లీషుని రుద్ది, తెలుగు వలన తాము చాలా నష్టపోతామనే ఆందోళన కలిగిస్తారు. అలా తల్లిదండ్రులు, పిల్లలు కూడా ఇంగ్లీషు మీడియం మాత్రమే కోర్తున్నారని ఒక అపోహను కల్పిస్తారు. నిజానికి ఏ తల్లీ, తండ్రీ తమ పిల్లలకు తెలుగు నేర్పించవద్దని కోరరు. దేశవ్యాప్తంగా అన్ని మాతృభాషల విషయంలోనూ ఇదే జరుగుతోంది.

మహాత్మాగాంధీ తన చిన్ననాడు తనను బలవంతంగా ఇంగ్లీషు మీడియంలో చదివించారని, నాలుగేళ్ళపాటు నేర్పిన ఈ శాస్త్రాల్ని ఆంగ్లంలో కాకుండా గుజరాతీలో నేర్పినట్లైతే తేలికగా ఒక్క సంవత్సరంలోనే నేర్చుకోగలిగి ఉండేవాడినని అన్నారు. విద్యా వ్యాపారులకు కంటగింపు కలిగించే అంశం అయినప్పటికీ ఇది నిజం. వారి లక్ష్యం గుమస్తాగిరికి పనికొచ్చే వారిని తయారు చేయటమే గానీ, నోబెల్ బహుమతి పొందగలిగిన వారిని తయారు చేయటం కాదని గాంధీ మహాత్ముడే స్వయంగా పేర్కొన్నారు. ఈ విషయంలో తల్లిదండ్రులు నిమిత్తమాత్రులు.

ఏ వర్గాల ప్రజలకైనా మాతృభాష ఒకటి ఉంటుంది. అది వారు తప్పని సరిగా నేర్చి ఉండాలి. ఒక క్లాసు ఇంగ్లీషు చాలదనేవారు ఒక క్లాసు తెలుగు ఎలా సరిపోతుందంటున్నారో అర్థం కాదు. సంస్కృతం విషయంలో గత పుష్కర కాలంగా కార్పోరేట్ విద్యాసంస్థలు ఇంగ్లీషులో వ్రాసినా మార్కులు వేస్తామంటూ సంస్కృతం ఎంత నేర్పించారో అందరికీ తెలుసు. రేపు ఒక క్లాసు తెలుగు విషయంలోనూ జరిగేది ఇదే! తెలుగు చదవనూ వ్రాయనూ రాకుండానే తెలుగు విద్యావంతులు, తెలుగు మేధావులు తయారౌతారు.

ప్రాథమికాంశాలు (బేసిక్స్) నేర్చుకోవటానికి చిన్నపిల్లవాడికి మాతృభాషే తగినదని అందరకూ తెలుసు. ప్రాథమిక విద్యవరకూ చాలినంతగా మాతృభాషను నేర్పిస్తూ ఆంగ్లాన్ని కూడా తగినంత నేర్పించటానికి ఎవ్వరికీ అభ్యంతరం లేదు. అంతర్జాతీయ

భాషని తీసేయాలి. ఎవ్వరూ అడగటం లేదు. ఆ అంతర్జాతీయ భాష ఒక్కటే నేర్పిస్తామనటమే ఇబ్బంది కలిగించే విషయం. 'ఒక క్లాసు తెలుగు' అనేది పై తరగతులకు సరిపోవచ్చు. కానీ, ప్రాధమిక విద్యకు చాలదని యునెస్కో మార్గదర్శక సూత్రాలు చాటి చెప్తున్నాయి. పేద, ధనిక తేడా లేకుండా కులమతాలకు అతీతంగా తెలుగు నేలపైన చదివే అందరూ తెలుగునీ ఇంగ్లీషునీ సమానంగానే చదవాలి!

శాస్త్రవిద్య తెలుగులో నేర్పటానికి తెలుగు అకాడెమీ చేసిన కృషి నిష్ఫలం అయ్యింది. పాఠ్యపుస్తకాల్లో పారిభాషిక పదాల అనువాదం సంస్కృత పదాలతో నింపి, క్లిష్టతరం చేశారు. అది అసలు తెలుగుకే ఎసరు పెట్టేదాకా వెళ్లింది. ప్రామాణిక అనువాదం లేకుండా శాస్త్రవిషయాలను పాఠ్యగ్రంథాలలో అరకొర తెలుగుతో నింపినా ఉపయోగం లేదు. ఇది మన శాస్త్రగ్రంథ రచయితల వైఫల్యం. ఎక్కువ సైన్సుని ఎక్కువ తేలికగా విద్యార్థికి ఎక్కేలాగా బోధన జరగాలి. ఉన్నత విద్యలో ఇంగ్లీషు మాధ్యమం విషయంలో భాషోద్యమం రాజీ పడటానికి ఈ బోధనాసామగ్రి తెలుగులో అందుబాటులో లేకపోవటమే కారణం.

మహాత్ముడు కూడా శాస్త్రవిషయాలలో సరళమైన అనువాదం చేయాలని రచయితలకు సూచించారు. ముఖ్యంగా తెలుగు విషయంలో అది జరగలేదు. ఇవ్వాళ ఇంజనీరింగ్, మెడిసిన్, మేథమెటిక్స్ లాంటి సబ్జెక్టులను తెలుగులో బోధించాలని ఎవరూ అడగరు. చైనా, జపాను, కొరియా లాంటి తూర్పుదేశాలలో అలాంటిది సాధ్యం అయ్యింది. మాతృభాష విషయంలో వారి నిబద్ధతే దాన్ని సాధించింది. అలాంటిది మనకు లేదు. కాబట్టి మనం ఇంగ్లీషుకు దాసులం కాకతప్పదు.

కనీసం ప్రాధమిక విద్యలోనైనా తగినంత మాతృభాషని నేర్పించండని మాత్రమే దేశంలోని మేధావులంతా రాష్ట్ర ప్రభుత్వాల వారిని కోరుతున్నారు. మాతృభాషాభిమానులు కూడా తమపిల్లల్ని ఇంగ్లీషు పాఠశాలలకు పంపక వేరే గత్యంతరం లేదిక్కడ. ఉన్నతమైన ప్రామాణికమైన తెలుగు మాధ్యమాన్ని ప్రభుత్వం అందించినా వాళ్లు ఇంగ్లీషు మాధ్యమాన్నే ఎంచుకుంటే అది హిపోక్రసీ అనే రెండు నాల్కల ధోరణి అవుతుంది.

ఇంగ్లీషులో 360 భాషల పదాలు చేరి ఉన్నాయి. అందులో తెలుగు పదాలు కూడా ఉన్నాయి ముఖ్యంగా శాస్త్ర సాంకేతిక పదాలు ఎక్కువగా లాటిన్, ఫ్రెంచి, జెర్మన్ భాషల్లోంచి స్వీకరించినవి. వాటిని ఇంగ్లీషులోకి అనువదించే ప్రయత్నం చేయకుండా యథాతథంగా స్వీకరించి ఇంగ్లీషువాళ్లు తమ బాషను పరిపుష్టి చేసుకున్నారు. చూసేవాళ్లకి అవన్నీ ఇంగ్లీషే నన్నంతగా భ్రమ కలుగుతుంది.

పారిభాషికపదాల స్వీకారం తెలుగులో కూడా జరగాలి. సమానమైన తెలుగు పదం దొరకనప్పుడు సంస్కృతాన్ని ఆశ్రయించటం కన్నా అసలు పదాన్ని యథా

తథంగా స్వీకరించి చక్కని తెలుగులో విద్యార్థికి వివరణ అందిస్తే మహాత్ముడు చెప్పినట్టు నాలుగేళ్ల చదువు ఏడాదిలోనే వస్తుంది. సరళమైన అనువాదం కుదరనప్పుడు అర్థం కాని అనువాదం చేయవద్దనే మహాత్ముడు రచయితలను కోరారు.

మాతృభాషాభిమానానికి ఒక నమూనాగా మనం చెప్పుకునే తమిళనాడులో తమిళ మాధ్యమ స్కూళ్లను రద్దుచేసే ప్రయత్నం కుమారి జయలలిత గారు కూడా చేశారు. అందుకు నాందిగా మొదట తెలుగు మాధ్యమం స్కూళ్లను రద్దు చేశారు. అంతలోనే ఆమె హఠాన్మరణం వలన తమిళం బ్రతికిపోయింది ఆ రాష్ట్రంలో!

ఒడీసాలో 4వ వంతు ప్రజలు ఆదివాసీ భాషలు మాట్లాడేవారే! వారంతా తమ పిల్లలకు మాతృభాషనే కోరుతున్నారు. తెలుగు నేలమీద అనేక ద్రావిడ ఆదివాసీ భాషలు మరణశయ్యపైన ఉన్నాయి. వాళ్లంతా ఇంగ్లీషే కోరుతున్నారనటం సరికాదు.

బెంగాల్ రాష్ట్రంలో వామపక్ష ప్రభుత్వం ప్రాథమికవిద్యలో బెంగాలీని తప్పని సరి చేసింది. తరువాత వచ్చిన మమతగారి ప్రభుత్వం దాన్ని రద్దు చేసి తిరిగి ఆంగ్లమాధ్యమాన్ని ప్రవేశపెట్టి నిరుద్యోగ సమస్యకు దీన్ని పరిష్కార మార్గంగా పేర్కొంది. ఒకటో తరగతి చదువుకూ, నిరుద్యోగ సమస్యకు, అమెరికా ఉద్యోగానికీ లంకె పెట్టేవారి మేథాతనానికి అబ్బురపడాలి.

2015లో ప్రాథమిక విద్య కోసం కర్ణాటకలో కన్నడాన్ని తప్పనిసరి చేసి, ఇంగ్లీషు మీడియం పాఠశాలలకు కొత్తగా అవకాశం లేకుండా చట్టం తెచ్చారు. కానీ, మైనారిటీ పాఠశాలలో ఇంగ్లీషుమీడియం కొనసాగించవచ్చని మినహాయింపునిచ్చారు. అది మైనారిటీలకు మాత్రమే ఇంగ్లీషులో చదువుకునే హక్కు ఇచ్చినట్టయ్యింది. వాదోపవాదాలతో మాతృభాష అనేది పక్కకు పోయింది.

ప్రాథమిక విద్య వరకూ తప్పనిసరిగా మాతృభాషలోనే నేర్పించాలనే చట్టం చేసేందుకు రాష్ట్రాలకు గల అధికారాన్ని హరిస్తూ సుప్రీంకోర్టు తీర్పునిచ్చి, భాషోద్యమం పైన నీళ్లు చల్లింది.

కేంద్ర ప్రభుత్వం ప్రత్యేక అధ్యయనం చేసి మార్గదర్శకాలు ఇస్తేగానీ మాతృభాషకు న్యాయం జరగదు.

లౌకిక సామాజిక వ్యవహారాల నిర్వహణ కోసం ఇంగ్లీషును రెండవ లేదా మూడవ భాషగా నేర్చుకున్నా సరిపోయే చోట, ఇంగ్లీషును మాతృభాషగా చేసుకోవాల్సిన పరిస్థితిని ప్రపంచీకరణమే తెచ్చి పెట్టింది. ఆ వరవడిలో మనుషులంతా కొట్టుకు పోతున్నారు. వెనక్కి తిరిగి ఆలోచిస్తే జాతి ఎంత నష్టపోతుందో అవగతం అవుతుంది.

ఏ దేశంలోనైనా మాతృభాషలు మాట్లాడేవారు ఆ దేశంలో స్థానికులు. వాళ్లని First Nations' people అంటారు. వాళ్ల భాషా సంస్కృతులు, జీవన వ్యవహారాలు,

సామాజిక జీవన పరిస్థితుల మీద వలసవాద ఇంగ్లీషు లాంటి భాషీయుల దౌష్ట్యం వలన మాతృభాషా సంస్కృతుల అణచివేత మొదలౌతుంది. చివరికి కొన్ని దేశాలలో మాతృభాషల్ని రహస్యంగా మాట్లాడుకునే స్థితి వస్తుంది. ఉత్తర అమెరికాలో అచ్చంగా ఇదే జరుగుతోంది.

అంతర్జాతీయ తెలుగు విమర్శకుడు ఆచార్య వెల్చేరు నారాయణరావుగారు తెలుగు రాని విదేశీయుడికి తెలుగు నేర్పించగలవారుల మన తెలుగు ఉపాధ్యాయుల్లో ఎందరున్నారని అడిగారు. తెలుగు 'ప్రపంచతెలుగు' కావటానికి మొదట ఏది కావాలో ఈ ప్రశ్నలో జవాబు దాగి ఉంది. మార్కెటీకరణం అనేది ప్రపంచీకరణంలో ప్రధాన విషయం కాబట్టి, మాతృభాషలు మార్కెట్టు స్థాయిని అందుకో లేకపోతే వలసవాదుల భాషకు ఎవరైనా దాసులు కావలసి వస్తుంది.

తెలుగును 'ప్రపంచతెలుగు'గా, తెలుగుమానవుణ్ణి 'ప్రపంచమానవుడు'గా తీర్చిదిద్దాలనే తాపత్రయం మొదట మనకు ఉంటే మన ఉనికిని, మన అస్థిత్వాన్నీ మనం కాపాడుకుంటూనే ప్రపంచ స్థాయికి ఎదగవచ్చు. మనసులో భాషా సంస్కృతుల పట్ల గౌరవం ఉంటేనే ఆలోచనలు ఈ దిశగా సాగుతాయి.

తెలుగు నేలమీద తెలుగుతోపాటు అనేక మాతృభాషలున్నాయి. వారిని కనీసం ప్రాధమిక విద్యవరకూ వారివారి మాతృభాషల్లో పెరగనివ్వండి! చదవనివ్వండి. అలాగే, ఆంగ్లాన్ని కూడా చాలినంత నేర్పించండి. ప్రపంచానికి పనికొచ్చే విశ్వమానవులుగా మనం మన బిడ్డల్ని తయారు చేసుకోగలుగుతాం.

2019వ సంవత్సరాన్ని అంతర్జాతీయ మాతృభాషల దినోత్సవంగా (International Year of Indigenous Languages) ప్రకటించింది. ఈ నేపథ్యంలో తెలుగు నేలమీద నెలకొని ఉన్న అన్ని మాతృభాషల పరిరక్షణ, అభివృద్ధి, ఆధునీకరణల లక్ష్యంగా ప్రపంచ తెలుగు రచయితల 4వ మహాసభలను నిర్వహించి ప్రపంచ తెలుగు రచయితల సంఘం మరియు కృష్ణాజిల్లా రచయితల సంఘం ప్రజల గుండె తలుపులు తట్టే ప్రయత్నం చేశాయి. ఈ భాషోద్యమ దీప్తి కొనసాగాలి.

అమ్మభాషను కాపాడుకుందాం. స్వాభిమానం చాటుకుందాం అనే నినాదాన్ని ప్రతీ ఒక్కరూ నలుగురికి చేరవేసి, ఆ నలుగురూ మరో నలుగురికి చేరవేసే విధానాన్ని అవలంభిస్తే మాతృభాషా పరిరక్షణ-అభివృద్ధి కూడా సాధ్యమే!

మహాత్ముడు మాతృభాష కోసం వేసిన బాట నూరేళ్ళ తరువాత కూడా నడిచిన వారు తక్కువయినా నిర్మలంగానే, అనుసరణీయంగానే ఉంది. రేపటి అవసరాలకూ ఈ దారే రహదారి.

## జాతీయ విద్యా విధానం -2019

డా. కె కస్తూరి రంగన్ అధ్యక్షతన 2017 జూన్లో ఏర్పాటు చేసిన జాతీయ విద్యావిధాన రూపకల్పనా సంఘం 2019 మే 31న నేషనల్ ఎడ్యుకేషన్ పోలసీ 2019 పేరుతో తన నివేదికను అందించింది. Access, equity, quality, affordability and accountability అనే అంశాల పైన ప్రధానంగా దృష్టిపెట్టి ఈ నివేదికను రూపొందించినట్టు ప్రకటించింది.

ప్రాథమిక విద్యలో పిల్లల సంరక్షణ, ప్రస్తుత పరిక్షల విధానంలో సంస్కరణలు, ఉపాధ్యాయులకు తగినంత శిక్షణ, విద్యా నియమాల పునర్నిర్మాణాలను ఈ కమిటీ ప్రధానంగా దృష్టిలో కేంద్రీకరించింది. జాతీయ విద్యాకమిషన్ ఏర్పాటు, విద్యావ్యవస్థలో పౌరపరమైన పెట్టుబడులు, సాంకేతిక పరిజ్ఞానాన్ని బలంగా ఉపయోగించుకోవటం, వృత్తివిద్యలు, వయోజన విద్యల మీద దృష్టిపెట్టడం వగైరా అంశాలను పరిగణనలోకి తీసుకుంది. మాతృభాషలలో విద్యాబోధన గురించి ప్రత్యేకంగా అనేక సూచనలు చేసింది. ప్రాథమిక విద్య నేర్చే చిన్నపిల్లలకు అర్థంకాని భాషలో విద్య నేర్పాలని ప్రయత్నించటం వలన చదువును మధ్యలో ఆపేసే వారి సంఖ్య పెరిగిపోతోందనీ, 5వ తరగతి వరకూ, వీలైతే 8వ తరగతి వరకూ విద్యార్థి మాతృభాషలోనే చదువు నేర్పటం తప్పనిసరి అంశంగా ఈ కమిటీ ప్రతిపాదించింది.

త్రిభాషా సూత్రం ప్రకారం హిందీ రాష్ట్రాలవారు ఇంగ్లీషు హిందీలతోపాటు ఏదైనా దక్షిణాది భాష నేర్చుకోవాలి. అలాగే, దక్షిణాదివారు తమ మాతృభాష మరియు ఆంగ్ల భాషలతో పాటు హిందీని తప్పనిసరిగా నేర్చుకోవాలి. ఈ సిద్ధాంతాన్ని సమర్థవంతంగా అమలు చేయాలని ఈ కమిటీ సూచించింది. జాతీయ సమైక్యతాభావాన్ని విద్యార్థులకు కలిగించటానికి ఈ విధానం అవసరంగా భావించింది. 6,7 తరగతుల్లో కావలసిన భాషను ఎంచుకునే అవకాశం కల్పించాలని సూచించింది.

పాళీ, ప్రాకృతం, పర్షియన్ సహా అన్ని భారతీయ భాషల్ని పరిరక్షించి, అభివృద్ధి చేసే దిశగా విద్యాబోధన సాగాలి. ఉన్నత విద్యాసంస్థలన్నీ ఈ మూడు భారతీయ భాషల్లో అత్యంత నాణ్యతా ప్రమాణాలు కలిగిన బోధకుల్ని నియమించాలి.అన్ని రంగాలకు చెందిన శాస్త్ర సాంకేతిక పరిభాషాపదాలు భారతీయ భాషలన్నింటిలోకి అనువాదం కావాలని ఈ కమిటీ కోరింది.

ఆశయానికి ఆచరణ కడుదూరం అనేది మన దేశంలో అనేక సందర్భాల్లో ఋజువైన సత్యమే! అయినా భారతీయులు ఆశాజీవులు. సగం గ్లాసు నిండిందన్నట్టే ఆలోచిస్తారు. మిగతా సగం కూడా త్వరగా నిండుతుందని ఆశిస్తారు.

నిజానికి ఈ నివేదిక లోని ప్రతిపాదనలన్నీ భాషోద్యమం చాలా కాలంగా చేస్తూ వచ్చిన విన్నపాలే! కానీ, వివిధ రాష్ట్రాలలో మాతృభాషల పైన మీదుమిక్కిలి స్వంత అధికార భాషలపైన అధికారపరంగానే దాడులు జరుగుతున్న నేపథ్యంలో ఈ నివేదిక జాతీయస్థాయిలో ఒక నియంత్రణ తెస్తుందని భాషోద్యమం భావిస్తోంది. కేంద్ర ప్రభుత్వం సత్వరం ఈ నివేదిక అమల్లోకి తేవటమే పరిష్కారం!

అమ్మభాషను సంరక్షించుకోవటానికి, స్వాభిమానం చాటుకోవటానికి ఈ చట్టం దోహద పడాలి!

## నవనిర్మాణ కార్యక్రమాలు-నయీతాలీమ్

అబ్రహాం లింకన్ తన కుమారుణ్ణి ప్రాథమిక విద్యకోసం బడికి పంపిస్తూ, ప్రధానోపాధ్యాయుడికి ఒక ఉత్తరం వ్రాశారు : "ఈ ప్రపంచంలో దుర్మార్గులున్నట్టే మంచివారుకూడా ఉంటారు. ప్రతీ విరోధికీ ఒక మిత్రుడు ఉంటాడనే విషయాన్ని గ్రహించగల నేర్పరితనాన్ని మా అబ్బాయికి మృదువుగా చెప్పి నేర్పించండి. పుస్తకాలలో చదుకోవటం ద్వారా పొందిన మేథస్సుని ఎంత ధరకైనా అమ్ముకోవచ్చు. కానీ, ఎట్టి పరిస్థితుల్లోనూ హృదయానికి మాత్రం ధరను తెలిపే చీటీని తగిలించుకోకూడదని అతనికి చెప్పండి. కష్టపడకుండా వచ్చే ఒక డాలరు కన్నా శ్రమించి తెచ్చుకున్న పది సెంట్లే ఎక్కువ విలువైనవని మా అబ్బాయి గ్రహించేలా చేయండి. వాడు ధైర్యవంతుడిగా ఎదిగేందుకు కావలసిన సహనాన్ని నేర్పండి. తనమీద తనకు నమ్మకాన్ని ప్రేరేపింప చేయండి. ఈ నమ్మకం వాడికి మనుషులమీద, దేవుడిమీద నమ్మకాన్ని ప్రేరేపిస్తుంది... Teach him to have sublime faith in himself, because then he will always sublime faith in mankind, in God" అని! ప్రాథమిక విద్యకు సంబంధించిన ఒక రూల్ బుక్ లాగా ఈ ఉత్తరాన్ని ప్రపంచ విద్యావేత్తలు పరిగణిస్తారు.

ఔరంగజేబు తన ప్రాథమిక విద్యాకాలం గురువు అనాలోచిత విద్యలు నేర్పటం వలన తన విలువైన బాల్యం ఎలా వృథా అయ్యిందని భావించాడో ఆలోచనాపరుడైన నేటి విద్యార్థి కూడా అలా భావించే పరిస్థితి ఉండకూడదు కదా! చిన్ననాడు తనను అనవసరంగా ఆంగ్ల మాధ్యమంలో చదివించటం వలన తాను విలువైన కాలాన్ని నష్టపోయానన్నారు గాంధీజీ.. ప్రాథమిక విద్య కోసం బలవంతపు ఆంగ్లమాధ్యమాన్ని రుద్దే వీళ్లూ రేపు ఇలానే మాట పడవలసి వస్తుంది.

ఉన్నత వ్యక్తిత్వం అందించే ప్రాథమిక విద్య మాతృభాషలోనే జరగాలనే ఆచరణని తన కార్యక్రమాల్లో ఒకటిగా చేసుకోనున్నట్టు గాంధీజీ 1915 లోనే ప్రకటించారు. "పిల్లలు ఇంగ్లీషులోనే ఆలోచించాలని, సంభాషించాలని ఆ విధంగా విద్య నేర్పించే భారతీయ తల్లిదండ్రులు అటు పిల్లలకు, ఇటు దేశానికి ద్రోహం చేసిన వారౌతారు. దేశీయనాగరికత, సంస్కృతి, ఆధ్యాత్మిక విద్య తమ పిల్లలకు అందకుండా చేసిన వారౌతారు. అందువలన తమ పిల్లలు దేశసేవకు పనికిరాకుండా పోతారు." అని మహాత్ముడు స్వీయచరిత్ర (పుట 414)లో వ్రాశారు.

"నేడు మనకు కావలసినది స్వతంత్ర భారతదేశం. మాతృభాష నభ్యసించినవారే నేడు మనకు కావాలి. విదేశభాష నభ్యసించి, దేశంలో పరాయివాళ్లుగా తిరిగే పెద్దలు మనకు అనవసరం. ప్రజలభాషలో మంచిచెడ్డలు చెప్పేవారు కావాలి. కటిక బీదల మధ్య తిరుగుతూ వారు పనిచేయాలి. (యం. ఇం. 4-07-1929) అన్నారు గాంధీజీ. దేశసేవ, దేశభక్తి, దేశభాష, ఇలాంటి పదాలన్నీ అనవసర విషయాలని భావించే పెద్దలు మాతృభాషాద్వేషం కక్కుతున్నారు.

ప్రజల్లో ఆంగ్లవ్యామోహం ఉన్నంత మాత్రాన మనం నిరాశతో వెనుకడుగు వేయనవసరం లేదని, వారిని సమాధాన పరచి, మాతృభాషవైపుపి నడిపించే బాధ్యతని నవనిర్మాణ కార్యకర్తలకు అప్పగించారు. అందుకోసం 'నయీతాలీమ్' పేరుతో నూతన విద్యావిధానాన్ని ఆయన ప్రకటించారు. తాలిమ్ అంటే ఉర్దూ భాషలో 'విద్య' అని! నయీతాలిమ్ అంటే నూతనవిద్య!

వృత్తివిద్యలలో విద్యార్థినీ విద్యార్థులందరికీ ప్రావీణ్యత నందించటం, మాతృభాషలో ప్రాథమిక విద్యనందించటం, ఆంగ్ల భాషావ్యామోహాన్ని తగ్గించే చర్యలు చేపట్టటం నవనిర్మాణ కార్యక్రమంలో ముఖ్యమైన విషయాలు.

మెదడు, హృదయం, చేతులూ ఈ మూడింటి సమ్మేళనంగా నైతిక విలువలతో కూడిన నైపుణ్యాన్ని సాధించటం గాంధీజీ కొత్త విద్యావిధానం లక్ష్యం. "ఒక సేవకుణ్ణి తయారు చేసేందుకు చదువు" అనే సిద్ధాంతంతో ఆయన విబేధించారు. అది కేవలం విద్య కాదు. ప్రయోగవంతంగానూ, అనుభవ పూర్వకంగానూ జ్ఞానాన్ని అందించే విధానం" అన్నారాయన. ప్రస్తుత విద్యావిధానం మనిషి తన కాళ్ల మీద తాను నిలబడేదిగా లేదు. ఆత్మగౌరవం, ఆత్మవిశ్వాసాల్ని పెంచేదిగా లేదంటారాయన

"విద్యలో నూతన పద్ధతి రావలెనని చాలాకాలము క్రిందటనే నాకు గట్టిగా తోచెను. నేను దక్షిణాఫ్రికానుండి తిరిగి వచ్చాక నన్ను కలవాలని వచ్చిన విద్యార్థులతో

మాట్లాడినప్పుడు ప్రస్తుత విద్యావిధానం ఎంత నిష్ఫలమైనదో నాకు అర్థం అయ్యింది. అందుకని ఆశ్రమ పాఠశాలను చేతిపనుల శిక్షణతో ప్రారంభించాను. పుస్తక చదువుకు ఒక నూతన అర్థం నూతన ప్రయోజనం కలిగించ దలచాను".

"ప్రాథమిక విద్యలో ఇంగ్లీషు భాషను తీసివేయటానికే నేను నిశ్చయించాను. పిల్లలకున్న సమయంలో అధిక భాగం ఇంగ్లీషు పదాలను వాటి ప్రయోగాలను జ్ఞాపకం ఉంచుకోవటంతోనే తీరిపోతోంది. అంతేకాదు తాము నేర్చిన దాన్ని తమ స్వంత భాషలో తిరిగి చెప్పలేకపోతున్నారు. ఉపాధ్యాయుడు చెప్పింది సరిగా అర్థం చేసుకోలేకపోతున్నారు. అలక్ష్యం కారణంగా స్వంత భాషను క్రమేణా మరచిపోతున్నారు" ఇలా మన పిల్లలకు ప్రయోజనాత్మక విద్యలు నేర్పించాలని భావించారాయన.

గ్రామ పరిశ్రమలను విద్యకు కేంద్రంగా చేయాలనేదే మహాత్ముని ఆలోచన. 'ఉద్యోగం కోసం విద్య' అనే సిద్ధాంతం వలన గ్రామవిద్యలన్నీ నశించిపోయాయి. ఇవ్వాళ కమ్మరి, కుమ్మరి లాంటి చేతివృత్తుల్ని అంతర్జాతీయ ప్రమాణాలతో ప్రపంచస్థాయి వాణిజ్య వస్తువులుగా చేసే ఆలోచన మనకు లేకుండా పోయింది. 'మమ్మల్ని మట్టి పిసుక్కోమంటారా?' అనే ప్రశ్నలు ఉత్పన్న మౌతున్నాయి. వాటిని వృత్తివిద్యలుగా కాకుండా, కులవిద్యలుగా భావించినంత కాలం ఈ గ్రామీణ విద్యలకు జీవం ఉండదు. చేతివృత్తుల్లో ప్రావీణ్యతకు శిక్షణనిచ్చే విద్య కావాలి. ఈ యుగంలోనే ముఖ్యంగా ఇది అవసరం. కుల మతాలకు, పట్టణ గ్రామీణ భేదాలకు అతీతంగా ప్రతీ విద్యార్థి తప్పనిసరిగా మట్టి పిసకాల్సిందే ననేది మహాత్ముడి ఆదేశం. కష్టం గురించి కష్టపడి చదివేది కష్టాలు రాకుండా చేయటానికే ననే మహాత్ముని ఆలోచన ఆచరణలోకి వస్తే భవిష్యతరానికి మేలు కలుగుతుంది.

దక్షిణాఫ్రికాలో ఉన్నకాలంలో గాంధీజీ 'టాల్'స్టాయ్ ఫారం' నడిపేవారు. అందులో ఆయన కుమారులతో పాటు అనేక కులాలకు చెందిన ఇతరులు కూడా చదువుకునేవారు. శీ కాలెం భాష్ అనే ఆయన దగ్గర గాంధీజీ వడ్రంగం, చెప్పుల తయారీ నేర్చుకుని, తన విద్యార్థులకు నేర్పించారట. ఆయన స్వయంగా ఎన్నో ప్రయోగాలు చేసి అనుభవపూర్వకంగా గ్రహించిన అంశాలతో నయీతాలిమ్ రూపొందించాననేవారు. ఎందరినో ఈ ప్రయోగాలు చేసి, వారి అనుభవాలను తెలియజెప్పమనే వారు. ఊరూరా సదస్సులు నిర్వహించి, అభిప్రాయ సేకరణ చేసేవారు. తదనుగుణంగా తన విధానంలో మార్పులు చేసేవారు.

1945లో మహాత్ముడు "కాంప్రహెన్సివ్ బేసిక్ ఎడ్యుకేషన్ "పేరుతో మార్చిన విద్యావిధానాన్ని ప్రతిపాదించారు. పారిశుధ్యం, సత్యం, శరీరశ్రమ, సమానత్వం, పరస్పర సహకారం ఈ ఐదు అంశాలను ప్రధానంగా నేర్పించటం ఈ విద్య లక్ష్యం.

వృత్తిని ఒక కళగానూ, శాస్త్రంగానూ, దృష్టాంత పూర్వకంగా నేర్పించటంలో సమస్త విద్యల పరిజ్ఞానం ఇమిడి ఉంటుంది. నూలు వడుకు నేర్పించటం అంటే రకరకాల ప్రత్తి పంటల వివరాలు, విత్తనాల పరిజ్ఞానం, అది పండే నేలల వివరాలు, వాతావరణ పరిస్థితులు, అంతర్జాతీయ మార్కెటింగ్, ఇతర దేశాలలో వస్త్రాల అవసరాలు, గణిత గణాంకాల శాస్త్రాలు. ప్రత్తి నుండీ వస్త్రం దాకా సమస్త పర్జ్ఞానాన్ని కలిగించటం అనీ! ఇలానే అన్ని వృత్తులకూ సంబంధించిన ఆధునిక పర్జ్ఞానాన్ని విద్యార్థికి నేర్పిస్తే లక్షల్లో ఫీజులు తీసుకునే కార్పొరేట్ విద్యాసంస్థల్లో నేర్పించే దానికన్నా ఎక్కువ బాగుపడే చదువు చెప్పినట్టు లెక్క. 'పని'కి వచ్చే విద్యల్ని నేర్పించలేని వ్యవస్థ ఎంత గొప్పదైనా అది పనికిరానిదే!

గ్రామావసరాల ననుసరించి దృష్టాంత పూర్వకంగా ఉపాధ్యాయులకు శిక్షణ నీయాలనేది మహాత్ముడి సిద్ధాంతం. అప్పుడే తమ అవసరాలను విద్యార్థి గ్రహించగలిగేలా చేయగలం అంటారాయన. తెలుగు విద్యార్థులు దారుశిల్పులు గానూ, రాతిశిల్పులుగానూ మృణ్మయ శిల్పులుగానూ అంతరాతీయ స్థాయిలో రాణిస్తే ఎవరికైనా అభ్యంతరమా? అలా రాణింపచేసే చదువులు మనకున్నాయా? అలాంటివి కావాలని మనం అడగ కూడదా? వాటిని ప్రాథమిక విద్య స్థాయినుండే నేర్పిస్తే, అప్పుడప్పుడే వికసిస్తున్న పిల్లల మనసుల్లో సమానత చిగురిస్తుంది. కులమత వర్గ భేదాల కాలుష్యం సోకకుండా ఉంటుంది.

"వార్ధాలోని హిందూస్థానీ తాలిమీ సంఘం వారి "నయీతాలీమ్" మాసపత్రికకు తన సందేశం పంపుతూ (14-10-1938) గాంధీ ఇలా అన్నారు : "నయీతాలీమ్ అనే నూతనవిద్య కొత్తదనం ఏమిటో మొదట తెలుసుకోవాలి. పాతవిద్యా పద్ధతి లోని మంచినంతా తీసుకోవాలి. కొత్తగా చేర్చవలసిన అంశాలు ఇవి : మనకు పట్టిన నిస్పృహ అంతరించి ఆశ ఉదయింప చేయాలి. దారిద్ర్యం పోయి తగినంత జీవనోపాధి కలిగించాలి. నిరుద్యోగం పోయి చేతినిండా పని, పరిశ్రమ వర్ధిల్లాలి. వైరభావం నశించి మైత్రి యేర్పడాలి. అది మన బిడ్డలకు అక్షరాస్యతతో పాటు జ్ఞానసంపాదనకు సాధనభూతమైన ఒక చేతి పరిశ్రమని కూడా నేర్పేదిగా ఉండాలి. ప్రాథమిక విద్యకు ఏడేండ్ల కాలపరిమితి ఉండాలి. ఇతర విద్యలతో పాటు

ఉపయుక్తమైన వృత్తి విద్య ఒకటైనా నేర్పించేలా ఉండాలి. ఆ వృత్తి విద్యతో వారు పూర్ణమానవులుగా తయారయ్యేలా దాని బోధన జరగాలి"అని!.

ప్రాథమిక విద్య శ్రమమీద ఆధారపడేదిగా ఉండాలి. శారీరిక శ్రమపట్ల, శ్రమతో కూడుకున్న వృత్తులపట్ల విద్యార్థికి గౌరవం కలగాలి. డిగ్నిటీ ఆఫ్ లేబర్ గురించి మనం ఉపన్యాసాలిస్తాం గానీ ఆచరణలో శ్రమని ద్వేషింప చేస్తున్నాం. పరస్పర సహకారం, స్నేహభావం, ఆర్థిక స్వయంప్రతిపత్తి పట్ల అవగాహన, బృందచైతన్యం (టీమ్ స్పిరిట్), నిజాయితీ, సత్యనిబద్ధత లాంటివి ప్రాథమిక స్థాయిలోనే నేర్పించటానికి ఆంగ్లం దేనికి? ఇవి నేర్పకుండా పిల్లలకు నేర్పేది వ్యర్థ విద్యే!

2019లో విడుదలైన ఒక సినిమాలో కథానాయకుడు రైతులపట్ల సానుభూతి కాదు, వ్యవసాయం పట్ల గౌరవం కావాలి" అనటం ప్రజల్ని బాగా ఆకట్టుకుంది. దీనర్థం ప్రజల్లో గ్రామీణ అవసరాల పట్ల చులకన భావం లేదనే! కేవలం ఇంగ్లీషు చదువులే ప్రజల్ని ఆవిధంగా ద్వేషభావం కలిగేలా ప్రేరేపిస్తున్నాయి. ఒక రైతు కొడుకు విద్యావంతుడైతే వ్యవసాయం మానేసి గుమాస్తాగా జీవించాల్సిన అవసరం ఏముందని గాంధీ అడిగిన ప్రశ్నకు సమాధానం ఉన్నదా? చదువుకున్న రైతుబిడ్డ తన పరిజ్ఞానం మేరకు మరింత మెరుగైన వ్యవసాయాన్ని ఎందుకు చేయకూడదు? వ్యవసాయం అనేది చదువుకున్నవాడు చేసే పని కాదనేది వ్యావసాయిక దేశమైన భారతీయ సిద్ధాంతం కానేకాదు. శ్రీనాథుడు, పోతన లాంటి మహాకవులు రైతులే!

"చదువుకు పరమార్థం ఉద్యోగం కాదు, స్వయం పోషకత్వం" అంటూ మహాత్ముడు నయీతాలిమ్ విధానాన్ని ప్రకటించారు. "ఇది అహింస నుండి ఉత్పన్నం అవుతోంది. మన దేశ సంప్రదాయాలకు, సంస్కృతికి, ప్రతిభకు మన పిల్లలని ప్రతినిధులుగా చేయగలగాలి. స్వయం పోషకమైన ఈ కొత్త చదువు ద్వారా మాత్రమే అది సాధ్యం అని నమ్ముతున్నాను. (హరిజన్ 30-10-1937)" అనే మహాత్ముని వచనాలు పరభాషా వ్యామోహ పరుల్ని కొంచెమైనా కరిగిస్తాయేమో చూద్దాం.

మాతృభాషలో ప్రాథమిక విద్యని స్వయం పోషకత్వాన్ని కలిగించే రీతిలో బోధించాలని అడిగే వారికి కులతత్వాల్ని, వర్గ దృక్పథాల్ని అంటగట్టడం వలన మన పిల్లలకు అపకారం జరుగుతోన్న వాస్తవాన్ని వీరు గుర్తించాలి!



86




ప్రపంచ తెలుగు రచయితల సంఘం ప్రచురణ -3

# మాతృభాష మహాత్ముడి బాట

డా॥ జి.వి. పూర్ణచందు

## Check List

| | | | |
|---|---|---|---|
| Book Number | G.V.P01M258 | Date | 11/02/21 |
| Front Cover | yes | Back Cover | yes. |
| Blank Pages | 60, 57. | | |
| Missing Pages | NO | | |
| Prepared | Lakshmi | Scanned | K.yameema |
| BOOK SIZE | H 8.4 W 5.5 | Pages | 61 |